నివాస గృహము
వద్ద
సౌందర్యముకు
సౌందర్యవతులు

ముద్రింపబడిన రంగు
సిల్కు

ఖటావ్
వాయిల్



మంచిరకమునే కొనుడు
స్వదేశీ వస్తువులనే
కొనుడు

ది ఖటావ్ మెకంజీ స్పిన్నింగ్ అండ్ వీవింగు కంపెనీ, లిమిటెడ్, మిల్లులు: బైకుల్లా, బొంబాయి, ఆఫీసు: లక్ష్మీ బిల్డింగు, బాలార్డ్ ఎస్టేట్, బొంబాయి. 1 చిల్లర బట్టల దుకాణము: మూల్జీ జెఠామార్కెట్ బొంబాయి 2. చిల్లర బట్టల దుకాణము: 218 నేతాజీ సుభాష్‌చంద్ర బోస్ రోడ్డు, మదరాసు.

SISTA'S KMS 104 Telugu.

# మనుజునకు రక్తమే జీవనము

రక్తమే ప్రాణాధారము. ఈ రక్తము దేహమంతయు నాడుల మార్గమున పారి శరీరపటుత్వమును కలిగించుచున్నది. రక్తము మనము భుజించు ఆహారము నుండి పుట్టుచున్నది. కొందరు తమ శరీరదార్ఢ్యమును కాపాడుకొను మార్గములను మఱచి వ్యాధుల పాలగుచున్నారు. ఇక్కాలపు విద్యావ్యాసంగము ఉద్యోగ ధర్మములు చాలవరకు మనుజులను అనారోగ్యులుగ జేయుచున్నవి. మఱియు విశేష సంచారము, అకాల భోజనము, మితిమీరిన భోజనము, మనోవ్యాకులము, మొదలగు వాటిచేత మనుజునకు జఠరాగ్ని మందగించి ఆహారమందు యిచ్ఛలేక వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. ఈ కారణమువలన కొంతకాలమునకు శరీరమునందు నిరాటంకముగా ప్రవహించెడు రక్తమునకు ఆటంకము కలిగి అశక్తుడై, రక్తముచెడి అజీర్ణము ముఖ్యముగా సంభవించుచున్నది. ఈ అజీర్ణవ్యాధిని ఆధారపఱుచుకొని గుల్మము, కడుపుబ్బరము, మలబద్ధము, భేదులు, వాంతి, అరుచి, పాండు, కామిల మొదలగు వ్యాధులు కలుగుచున్నవి — మందబుద్ధి, ధాతుక్షీణము కూడ కలుగుచున్నవి. అపరిశుద్ధ రక్తమువలన శోభ, తీట, మేహంపాడ, తామర, మేహవ్రణములు మొదలగు చర్మవ్యాధులు కలుగుచున్నవి.

ధాతుక్షీణము, అశుద్ధరక్తము, రక్తమునకు ఆటంకము కలిగించి పక్షవాతము, సంధివాతము, మొదలగు వాతరోగములు సంభవించుచున్నవి. శ్వాసకోశములు, హృదయము, పిత్తకోశముచెడి, కాసక్షయాదులు, హృద్రోగము, ఉన్మాదము, మూర్ఛ, మొదలగు వ్యాధులు సంభవించును.

సమస్తవ్యాధులకు మూల కారణమగు అపరిశుద్ధ రక్తమును శుద్ధపరచి మనుజుని ఆరోగ్యమును కాపాడుటకు మా 'అమృత' శ్రేష్ఠమయినదని వాడినవారు చెప్పుచున్నారు.

'అమృత' పైవ్యాధులను కుదుర్చుటయేగాక నిలు కడగనుండు తలనొప్పి, కడుపులోమంట, అరిచేతులు, అరికాళ్లు, కండ్లమంటలు, నిస్త్రాణ, నిద్రలేమి, వీటిని నివర్తించును.

'అమృత' లో మూత్రసంబంధమైన జబ్బులను కుదుర్చు ఓషధులు కలిసియుండుటచే మూత్రపు అడ్డు తొలగి ప్రమేహ రోగములను కుదురును. విషములను విరుచుమూలికలు చేరియున్నవి గనుక, విషక్రిమి కాటులవల్లను, రసగంధక, పాషాణాది విషద్రవ్య దోషములవల్లను చెడినరక్తమును శుద్ధియగును.

'అమృత' వలన స్వప్నస్ఖలనము, శుక్లస్రావము మందబుద్ధి, సుఖ సంకటములు, కీళ్లునొప్పులు మొదలగు జబ్బులు కుదురుచున్నవి. మంచిబలము, రక్తవృద్ధి, ఆరోగ్యము, ఇంద్రియపుష్టి, వాక్చాతుర్యము, దీర్ఘాలోచనశక్తి కలుగుచున్నవి.

**'అమృత' సారవంతములగు మూలికలతోను, రసవంతములగు ఫలములతోను మకరందపూరితములగు పుష్పజాతులతోను తయారుచేయబడిన ద్రావకము. ఇది బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యదశల యందు ఎల్లరు సేవించుటకు దగినట్లు తయారు చేయబడినది.**

**'అమృత' యను నామమునకు తగినట్లు రుచికరముగను యింపైన సువాసనతో నిండియుండునట్లుగను తయారు చేయబడినది.**

**12 ఔ॥ బుడ్డి రు. 4—4—0**

**6 ఔ॥ బుడ్డి రు. 2—4—0**

## కేసరి కుటీరం లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14**

తెలంగుజిల్లాలకు, నైజామునకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు




వ్యవస్థాపకులు

## డాక్టరు. కే. యస్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. కె. పున్నయ్య

సంపుటము 23] జూలై 1954 [సంచిక 6

# వి షయ సూ చి క





---




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

---

# రాణీ ఝాన్సీ లక్ష్మీబాయి

ఝాన్సీరాణి అమరగాధ స్వాతంత్ర్య పిపాసతో ముందుకు నడుస్తున్న ప్రతి జాతికి, దేశానికి వెలుగును చూపించి, ఆత్మవిశ్వాసాన్ని, ఉత్సాహాన్ని పురికొల్పుచుండు ప్రకాశవంతమైన నక్షత్రము. 1875–నాటి భారత స్వాతంత్ర్య సమరంలో ఆమె ప్రదర్శించిన వ్యక్తిత్వము, సలిపిన వీరోచితమయిన పోరాటము, చేసిన త్యాగము చిరస్మరణీయము. కాబట్టే భారత ప్రజానీకం ఏటేటా వర్ధంతి ఉత్సవాలు జరుపుతూ ఆరాధిస్తున్నది.

రాణీ లక్ష్మీబాయి – ఒక వీరాంగన – గుటగుటలాడుతున్న ఆ నాటి భారత జాతీయతను రగుల్కొలిపి ప్రజలలోని నిస్పృహ నిరాశలను పటాపంచలగునట్లుచేసి, విధివిరామంలేకుండా సమరస సమైక్యతా భావాలను ప్రజలకు ప్రబోధించి, ప్రజల సహకారముతో వీరోచితంగా పోరుసల్పి, తన ప్రాణాలను సయితం దేశంకొరకు

స్వాతంత్ర్యసిద్ధి నుద్దేశించి త్యాగము చేసింది. ఆ వెలుగే దరిమలా స్వాతంత్ర్యోద్యమాన్ని ద్విగుణీకృతంచేసిన ఫలితంగానే యీ నాడు స్వతంత్ర భారత దేశ నిర్మాణం జరుగడం, అభ్యుదయ మార్గంలో నడువకలుగుచుండుట ఏర్పడినవి.

కాని ఆ వెలుగుతో అక్కర అంతటితో తీరిపోయిందనుకోడం పొరబాటు. ఝాన్సీరాణి ఆదర్శలక్ష్యాలు యింకా పూర్తిగా సిద్ధించలేదు. రోజున కొకరకంగా మారుతున్న ప్రపంచపరిస్థితులలో మన ఉనికికి, స్వాతంత్ర్య రక్షణకు, వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొనుటకు, ప్రజలు విశాల దృక్పథంతో సమరస సద్భావములను పెంపొందించుకొని జాతీయపురోభివృద్ధికి ప్రాధాన్యతయిస్తూ అంతర్జాతీయ పరిస్థితుల కనుగుణ్యంగా యింటా, బయటకూడ వివిధ క్లిష్ట సమస్యలను పరిశీలనాదృష్టితో గమనించి వ్యవహరిస్తుండాలి. ఈ నాడు స్వతంత్ర భారతంలోని ప్రజల బాధ్యతలు మరింత గురుతరమైనవే కాక తమ మనుగడకే అత్యంత ప్రధానమైనవను విషయం గమనించవలసినది.

రాణీ లక్ష్మీబాయి స్వాతంత్ర్యపిపాస, స్వార్థత్యాగము, విశాల దృక్పథము జాతీయ పురోభివృద్ధిని నలుముఖాల పెంపొందించగలదని ఆశిద్దాం!

# ఆంధ్ర హైకోర్టు

ప్రత్యేక రాష్ట్రంతోబాటు ప్రత్యేక న్యాయస్థానంకూడ ఏర్పడటంతో ఆంధ్ర రాష్ట్రానికి సంపూర్ణత్వము సిద్ధించినట్లే.

న్యాయపరిపాలన, నిర్వహణల నుద్దేశించి శాంతిభద్రతలను, న్యాయమును ప్రభుత్వచట్టాలననుసరించి ప్రజలకు సమకూర్చడమే న్యాయస్థానాల లక్ష్యము. కాని యీ న్యాయమును, శాంతిభద్రతలను న్యాయస్థానాలు ప్రజలకని ఉద్దేశించినప్పుడు విశేషవ్యయప్రయాసలు, జాప్యం జరుగకుండా, ఉత్తమసాంప్రదాయాలను పోషించి పెంపొందజేయాలి. ఇందుకు న్యాయమూర్తులు, న్యాయవాదులు పరస్పరంగా సహకరించి వ్యవహరించాలి.

ఆంధ్ర హైకోర్టు స్థాపన సందర్భమున ప్రెసిడెంటు రాజేంద్రప్రసాద్, ప్రధాని నెహ్రూ, అన్ని రాష్ట్రప్రభుత్వాధినేతలు, మంత్రులు, ప్రజానాయకులు పంపిన ఆశీస్సులు శుభసందేశాలు ఆంధ్ర హైకోర్టుకు మహోజ్వలమైన భవిష్యత్తును సూచిస్తున్నవి. ఈ

సందర్భమున ఉన్నత న్యాయస్థాన సత్సాంప్రదాయాలను ఆంధ్రదేశం దృష్టిలోనుంచుకొని తను ఉమ్మడి శ్రేయస్సుకు, ధర్మ పరిపాలనకు దోహదంచేయగలదని మా విశ్వాసం.

కాని తప్పని సరైతే తప్ప చీటికిమాటికి న్యాయస్థానాల పాలుకావడం ప్రజలకు శ్రేయస్కరంకానేరదు. నైతికస్థాయిని పెంచుకొని సమరస సద్భావాల కలవడిన ప్రజానీకానికి న్యాయస్థానాల ఆవశ్యకత బహుస్వల్పము. దాంతోబాటు శాంతిరక్షణలాంటి సమస్యలు సయితం మరింత సులభసాధ్యములుకాగలవు. అలాకాకుండా కక్షలు పెంచుకొని పట్టుదలలకు ప్రాధాన్యతయిచ్చి కోర్టులకెక్కితే విశేషవ్యయప్రయాసలు, విరోధాలు పెరిగిపోతవి.

ఆంధ్ర హైకోర్టు సత్సాంప్రదాయాలతో ధర్మాన్ని నెలకొల్పడానికి న్యాయనిర్వహణచేయగలదని, ఇండియాచీఫ్ జస్టిస్ మహాజన్ విమర్శిస్తూ చెప్పిన న్యాయనిర్వహణజరిపించడంలోగల దోషాల నధిగమించి కలకాలము వర్థిల్లగలదని ఆశించుచున్నాము.



ఇండియా ప్రభుత్వం ప్రపంచ వైజ్ఞానిక సంఘం సహాయంతో 1952లో నెల కొల్పిన భారత జాతీయ వైజ్ఞానిక పత్రాల రచనా సంఘం విషయానుక్రమణికను ప్రచురించారు. ప్రపంచమందంతటాగల వైజ్ఞానిక పత్రికలలోని, సాంకేతిక పత్రికలలోని వ్యాసాలు, విషయాలు అందులో కలవు. భారతీయ శాస్త్రవేత్తలకు మామూలుగ ఆవ్యాసాలు చూడడానికి, ఆపత్రికలు తమకు చేరడానికిముందే ఈ ప్రచురణవల్ల ఆ విషయాలను తెలుసుకోగలుగుతారు.

♦ ♦ ♦

అంధులైన వారికి పనులు కల్పించడానికి ఇండియా ప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖవారు తలపెట్టిన ఒక కర్మాగారం, బ్రెయిలీ ప్రెస్సులకు జూన్ 28వ తేదీన డెహ్రాడూన్‌లో ప్రారంభోత్సవం జరుపబడింది. స్థానిక అంధవయోజనుల శిక్షణకేంద్రంలో తర్ఫీదు పొందిన వారికి తగిన వృత్తులు ఈ కర్మాగారంలో చూపబడతాయి. పేముకుర్చీలను తయారుచేయడం, ఉన్నివస్త్రాలను తయారుచేయడం మొదట్లో ప్రవేశపెట్టబడింది. పోనుపోను ఇతరవృత్తులు ప్రవేశ పెట్టబడతాయి. ఇండియాలో ఒకేఒక సెంట్రలు బ్రెయిలీ ప్రెస్సువున్నది. ఆ ప్రెస్సులో బ్రెయిలీగ్రంధాలు వివిధ భారతీయ భాషలలోను ప్రచురించబడుతున్నాయి.

'వారం-వారం' నుండి



# విశ్వజ్యోతి

"రాయసం సోదరీమణులు"

(గతసంచిక తరువాయి)

## మూడవ రంగము

[ఎన్నికలు అయిపోతాయి. చంద్రయ్యను విజయ లక్ష్మి వరిస్తుంది. చంద్రయ్య ఆ గర్వముతో విఱ్ఱవీగి పోతుంటాడు. అన్ని విధాల మనోహర్, సుధాకర్‌లమీద పగతీర్చుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. సుధాకర్ జీవితము తారుమారయింది. జ్యోతి ఆదర్శాలకు అనుగుణ్యమైన ప్రభాకర్‌తో వివాహము జరిగింది. మూడునెలలు తిరగకముందే ప్రభాకర్ మరణిస్తాడు. జ్యోతి జీవితములో అంధకారము అలముకుంది.

(ఒక రోజున కుర్చీలో సుధాకర్ పంచ, పొడుగు చేతులచొక్కా, కళ్ళద్దాలతో-ముఖములో పూర్వపు ఉత్సాహము కనబడదు. ఏదో పత్రిక చదువు తుంటాడు.)

సుధాకర్:-అమ్మాయి జ్యోతీ! ఏమిచేస్తున్నావు.

జ్యోతీ:-(పాతచీర, కళావిహీనమైన మొఖము వెంట్రుకలుచుట్టతో ప్రవేశము.) ఆచార్య ఆత్రేయగారు వ్రాసిన విశ్వశాంతి చదువుతున్నా నన్నయ్యా! నిజంగా ఎంతబాగుంది!

సు:-అవునుతల్లీ మనవంటివాళ్ళకు సంసారాల్లో శాంతి లేకపోతే విశ్వశాంతి ఎలా లభిస్తుంది?

జ్యో:-అది స్వార్థమన్నయ్యా! నలుగురుచేరితే ఒక సంఘము. అలాంటి నాలుగు సంఘాలు ఒక దేశము. అలాంటి దేశములు చేరితేనేకదూ ప్రపంచము. ఆ ప్రపంచ శాంతిని ఆశిస్తే దేశ శాంతి, సంఘశాంతి లభిస్తుంది. అప్పుడే సంసారాలు స్వర్గతుల్యంగా అవుతాయి.

సు:-అవును తల్లీ! నిజంగా నీకెంత ఉదారబుద్ధి! ప్రతి వ్యక్తికి సంఘములో నీవలె ... బాగుండు (నిరాశగా చూస్తుంటాడు.)

మనోహర్:-(ప్రవేశం) ఏం సుధాకర్! అలా వున్నావు. జ్యోతీ! అన్నీ తెలిసిన నీవుకూడా ఇలా అయిపోతే ఎట్లా?

సు:-మనోహర్! నిక్షేపములాంటి జ్యోతి జీవితము అన్యాయమయింది.

జ్యో:-అన్నయ్యా! మీరలా బాధపడడము ఎందుకు! మన అదృష్టాన్ని నిందించుకోవాలెగాని మనము ఏమిచేయగలము?

మ:-ఇప్పుడేమి ముంచుకపోయింది? మళ్ళీ జ్యోతి జీవితములో జీవజ్యోతిని వెలిగిస్తాము. అందరికీ ఆదర్శముగా నిలుస్తాము. మనకు భయమేమిటి? సుధాకర్! అంటే జ్యోతికి మరల వివాహము చేస్తాము. ఏమంటావు జ్యోతీ!

సు:-మనోహర్. ఇప్పటికే మన పరిస్థితి చూశావు కదూ. ఈ ఊళ్ళో జ్యోతికి మరలా వివాహము చేస్తే మనమింకా అథోగతిపాలంకామూ మనోహర్! మన జీవితాలు ఇలా గడిచిపోవలసిందే. మనము బలహీనులము. సంఘాన్ని ఎదిరించి నిలువలేము.

మ:-సుధాకర్! మనము బలహీనులమే - మనము సంఘాన్ని ఎదిరించలేము. కథల్లో వ్రాసి ఏమేమో శ్రీరంగనీతులు మాట్లాడే మహనీయులంతా చెప్పేది చేయకలుగుతున్నారా? అది దేనివల్ల? సంఘములోవుండే పరిస్థితులను ఎదుర్కోలేక

కదూ ! పెద్ద సంఘసంస్కర్తలుగా అనుకుండే మహానుభావులు నలుగురిలో పలుకుబడివుండి లక్ష్మీపుత్రులుగావుండే వాళ్ళే కదూ ! అంటే నిజంగా సంఘసంస్కర్తలనా నీ అభిప్రాయము- అది ఒక బూటకము. అలా అయినా మంచి పలుకుబడి సంపాదించుకోవచ్చని-కాబట్టి మనము ఎవ్వరికీ వెరుపవలసిన పనిలేదు.

సు:-మనోహర్ నాకూ ఆ అభిప్రాయముంది, కాని ఎవరు ధైర్యముచేయగలరు జ్యోతిని పెండ్లిచేసుకోడానికి.

మ:-మనలాంటి ఆదర్శాలు కలవాళ్ళే లేరంటవా ఈ సంఘములో ! ఏం జ్యోతీ ! ఎన్నో విషయాలు మాట్లాడేదానివి. స్త్రీ సర్వస్వతంత్రయని ప్రపంచానికి చాటిన నీవే ఇలా అయిపోవడమా !

[సుధాకర్ లోపలికి వెళ్తాడు]

మ:-జ్యోతీ ! నీకు నిజంగా పునర్వివాహము ఇష్టము లేదా ? లేక సంఘపరిస్థితులవల్ల అలా అయిపోయినవా ?

జ్యో:-అదికాదు మనోహర్ ! ఇప్పటికే మనమీద చంద్రయ్య పగపాము. పునర్వివాహము తలపెడితే సంఘానికి దూరమయిపోతామేమో -

మ:-ఎవరేమన్నా అనుకోని-ఏమైనా కానీ, నీకు పెండ్లి చేసి తీరవలసిందే. ఒక మానవుడు తన జీవితాన్ని ఎడారిజీవితముచేసుకొని ఏఆశకోసమయినా ప్రపంచములో నాలుగు మూలలను వెతుకుతున్నా, తోడిమానవుని హేళనచేస్తాడు. ఎన్నికలు పెడ్తాడు. అలాంటప్పుడు మానవత్వము ఎక్కడ వుంది ?

[సుధాకర్ సరళ, ప్రవేశము]

సు:-(దండలతో ప్రవేశం) సరళా ! జ్యోతికి మళ్ళీ వివాహముచెయ్య నిశ్చయించుకొన్నాను.

సరళ:-వద్దండీ ! ఇప్పటికే మామూలంటే ఈ గ్రామములో పగ.

సు:-పిచ్చిదానా-మనల్ని ఏమిచేస్తారు ? చంద్రయ్య మూడోసారి 55-వ యేట పెండ్లిచేసుకుంటే అడిగేవాళ్లులేకపోయారు - జ్యోతి ఈ చిన్న వయస్సులో వైరాగ్యము పొందాలనా ! ఇదేనా మహనీయులు చెప్పేది ! ఇది చేయకపోతేనా సంఘము వెలివేసేది ? సరళా నీవుపోయి తాళిబొట్టు, బొట్టు తీసుకొనిరా. మనోహర్ ! ఇప్పుడు నీవు చేయబోయే కార్యము ఎలాంటి పరిస్థితులకు దారితీస్తుంది ఆలోచించావా ?

మ:-అలా భయపడుతావేమి సుధాకర్ !

[సరళ తెచ్చినబొట్టు జ్యోతి మొఖానా పెట్టడానికి ప్రయత్నిస్తుంది. చెయ్యి వణుకుతుంది. మనోహర్ పెట్టుతాడు. మనోహర్, జ్యోతులు దండలు మార్చుకుంటూరు. వీరేశలింగముగారి ఫోటోకు నమస్కరిస్తుండగా తెరపడుతుంది.]

## నాలుగవ రంగము

[జ్యోతి మనోహర్ల వివాహ విషయము ఆ వూరి వారందరితో వైరము కలిగించింది. సుధాకర్ సంసారమంటే వూరిలో, ఎవ్వరికీ గౌరవము లేదు. సుధాకర్, మనోహర్లు ఉద్యోగాలు పోగొట్టుకొని ఆ ప్రక్క ఊరిలో గుమాస్తాలుగా చేరుతారు.]

[సుధాకర్ గదిలో]

మోహన్:-సుధాకర్ ! ఎలాగైనా నీవు చేసింది తప్పు. ఇప్పుడు నీవు సాధించినది ఏముంది. వైరముతప్ప - చంద్రయ్య ఊరిలో వారందరిని రెచ్చగొట్టాడు. మీకు ఏవస్తువునిచ్చినా వారికి పుట్టగతులుండవన్నాడు. రచ్చ కీడుస్తామని ప్రయత్నిస్తున్నాడు. ఇంతకు నేను ఎన్నికలలో నిలబడడము ఇంతవరకు తెచ్చింది. ఇప్పుడు మాత్రము ఏమిముంచుకపోయింది. వివాహము కాలేదనుకొని జ్యోతికి ఇంతకుముందు మాదిరిగా ...

[మనోహర్ ప్రవేశం]

మ:- మోహన్ ఏదో నీనోటికి వచ్చినట్లు ప్రేలుతున్నావు. నీవు ఇలా మాట్లాడుతావని కలలో కూడా నేను అనుకోలేదే. జ్యోతి కళకళలాడుతూ పచ్చగా తిరుగుతుంటే చూడలేని వెధవల్లో చేరావు నీవు.

మో:- మనోహర్ వెధవా, గిధవా అంటున్నావు సుధాకర్ సంసారాన్ని ఈ స్థితికి తేవడానికి నీవే కారణము. అట్లా బజారులోకి పద - నీ బ్రతుకు తెలుస్తుంది - మొఖాన ఉమ్మేస్తారు.

మ:- ఇంకేం చంద్రయ్య బాగా నూరిపోశాడు. ఆ వెధవకు ఒక్కడికే డబ్బుండగానే ఇష్టమొచ్చినట్లు ఇతరుల సంసార విషయాల్లో జోక్యము చేసుకోవాలనా - ఆయన బ్రతుక్కు, ఆయన సంసారాన్ని బాగుచేసుకుంటే చాలు. 50 సం॥ వాడు మూడో పెండ్లికి తయారయితే నీవంటి శ్రీరంగ నీతులు చెప్పేవాళ్ళంతా ఎట్లాపోయినారు.

సు:- మనోహర్! అంతా జరిగిపోయింది. ఇప్పుడేమనుకోని ఏమిలాభము ?

మో:- అయిన ఇప్పుడనుకోని ఏమిచేయగలము ? నేను మొదటినుంచి చూస్తున్నాను మనోహర్ విషయము. దానికితోడు ప్రభాకర్ స్థితి అలాకావడము అంతా ఖర్మముగాకపోతే మరేమిటి?

మ:- ఏమిటన్నావు మోహన్! దీనికంతా నేనే కారణమన్నావా ?

మో:- ఆ మాట నేను అనాలనా ! అలా ప్రపంచములోకిపోయిచూడు ఒక్కసారి.

మ:- మోహన్ ! - (అంటూ చెంపమీద కొడ్తాడు.)

మో:- (తిరిగి కొట్టబోయి అడ్డమొచ్చిన సుధాకర్‌ను కొడ్తాడు) సుధాకర్ !

సు:- మోహన్ ! ఎందుకలా ఆవేశపడుతావు దీనివల్ల మనకుండే మనశ్శాంతికూడా నశిస్తుంది.

మో:- క్షమించు సుధాకర్ ! నేను ఒక అజ్ఞానుణ్ణి.

(తెర)

## అయిదవ రంగము

[రచ్చబండ - వెంకయ్య, చంద్రయ్య, మరిద్దరు కూర్చొని వుంటారు. మోహన్ మాసిన ప్యాంటు, చొక్కాతో ప్రవేశం.]

చం:- ఏం వెంకయ్యా ! మోహన్ వస్తున్నట్లున్నాడు

వెంకయ్య:- ఆ ... ఆ ... వాడేనండి. పిలుద్దామా

చంద్రయ్య:- ఆ ... పిలుద్దాము ... పిలు.

వెం:- అబ్బాయి, మోహన్ !

[మోహన్ చంద్రయ్య దగ్గిరకు వస్తాడు]

వెం:- మోహన్ ఏదో నిన్ను, నీ సంసారాన్ని ఎన్నో సంవత్సరాలుగా తెలుసు. నీ హితముకోరి చెప్తున్నాను. ఊరంతటికి తలవంపులు అయ్యేటట్లుగా చేసారే ఆ సుధాకర్, మనోహర్లు - వాళ్ళతో ఏమిటి నీ సంబంధము ? నీ తరహా ఏమి బాగా లేదు.

మో:- చెప్పవచ్చారూ - వెంకయ్యగారూ ! మా మంచి చెడ్డల సంగతి మాకు తెలుసు.

చం:- అవును తెలుసు. కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్లు ఆ సుధాకర్, మనోహర్‌లను పట్టుకొని వ్రేలాడు - నీవు పెద్ద సంస్కర్తవయిపోతావు. అయినా సంఘాన్ని ఎదిరించగానే సరా - దానిలోని లోతుపాతులను ఆలోచించుకోవద్దూ ! చేశారు చెల్లెలి పునర్వివాహము. ఇప్పుడు చూస్తుండలేదూ ప్రపంచము ఎట్లా గౌరవిస్తున్నదీని !

మో:- అవును పట్టున 18 సం॥ నిండని, జ్యోతికి వివాహముచేస్తే తప్పు. ఊరిలో వారందరికి - ముఖ్యంగా మీలాంటి పెద్ద మనుష్యులకు — మీ వంటివాళ్ళు షష్ఠిపూర్తితోపాటు వివాహము చేసుకోవచ్చు.

చం:-అనవసరంగా మాట్లాడవద్దు. అది మా స్వంత విషయము.

మో:-ఒక మానవుడు ఏదైనా మంచిపనిచేసి కీర్తి సంపాదించుకొన్నాడంటే, ఆ విషయాన్ని పట్టించుకోదు ప్రపంచము. ఏదైన ఒక చిన్న తప్పుచేస్తే వేలుఎత్తి చూపెడుతుంది. తన చెల్లెలు వివాహము చేసుకుంటే వీళ్ళకెందుకు బాధ. భర్త పోయిన తరువాత సంఘానికి భయపడి ఎడారి జీవితము చేసుకోలేదనేగా!

వెం:-ఇదంతా ఎందుకు సుధాకర్‌ను ఆ వివాహాన్ని రద్దుచేయమనిచెప్పు. తనకు, ఊరికి మంచిపేరు.

మో:-సరే వెళ్లోస్తాను.

[వెళ్తాడు]

చం: ఏం వెంకయ్యా! వీడు మహాప్రేలుతున్నాడే.

వెం:-ఆ! ఎన్నాళ్లులేండి!

చం: వెంకయ్యా అంతగాక ఎంత.

[ఇద్దరూ నిష్క్రమిస్తారు]

[మోహన్ తలపట్టుకొని ప్రవేశిస్తాడు]

మో:-సుధాకర్! నీవు నా బాల్య స్నేహితుడివి. మనమిద్దరముకలిసి చదివాము. ఇద్దరము ఆదర్శాల్లో ఒకే మాదిరిగా వుండేవాళ్ళం. నీవు చేసింది తప్పన్నానా? కాదు ఎన్నటికీకాదు. జ్యోతి సంతోషముగా కళాకాంతులతో తిరుగుతుంటే సుధాకర్‌కు సంతోషముకదూ? అయితే వీళ్ళందరూ ఇలా బాధపడుతారెందుకు? మానవుని అభివృద్ధిని చూడలేక తోటిమానవుడు విచారించడములోనేవుంది మానవుని గొప్పతనము.

సుధాకర్ విషయము ఇప్పటికే అన్యాయముగా వుంది. ఆ చంద్రయ్య గుట్టుగా సంసారాన్ని వెళ్ళబుచ్చే సుధాకర్‌ను రచ్చకీడవడముగాకుండా ఇంకా పగతీర్చుకోడానికి ప్రయత్నిస్తాడు. సుధాకర్ సంసారము సర్వనాశనమవుతుంది. సుధాకర్ ఆ వివాహాన్ని రద్దుచేయడు. నేను మాత్రము ఎలా చెప్పేది ... అలా అని నేను ఊరుకుంటే ... సర్వనాశనమవుతుంది సుధాకర్ జీవితము. సుధాకర్ జీవితాన్ని సంసారాన్ని పాడుచేయకుండా వుండాలంటే ఒకటే మార్గము కనిపిస్తుంది. జ్యోతిని మాయము చెయ్యాలి అంటే జ్యోతిని సుధాకర్ సంసారమునుంచి తీసివెయ్యాలి. ఎందుకు చెయ్యాలి? జ్యోతి ఏమి తప్పుచేసింది? ప్రపంచానికి ముఖము చూపించకుండా ఒకమూలపడి ఏడ్వకుండా తోటి స్త్రీలతోపాటు జీవితాన్ని ఆనందమయముగా చేసుకోటము తప్పా? అలా అని వూరుకుంటే ద్వేషము,పగ ప్రబలిపోతాయి వూరిలో. జ్యోతి సంతోషంగావుందని వెధవ సంఘానికి కండ్లు కుట్టింది. వాళ్లతాతసొమ్ము ఏదో వున్నట్లు ప్రవర్తిస్తారు.

అయినా నాపిచ్చికాకపోతే ఈ కలియుగములో సంఘమేమిటి! సంస్కారమేమిటి! వెంకయ్య చంద్రయ్యలాంటి స్వార్థపరులకేకదూ అగ్రస్థానము. వాళ్ళుచేసే ప్రతిపని సంస్కారముక్రింద వస్తుంది. వీళ్ళకోసము జ్యోతి జీవితాన్ని అంధకారము చేయడమా? జ్యోతి జీవనజ్యోతిని ఆర్పివేసి నేను ఎట్లా చూడగలను! అందువల్ల జ్యోతి జీవితాన్ని అంతమొందిస్తాను. లేకపోతే సుధాకర్ జీవితము సర్వనాశనమవుతుంది. (తలబట్టుకొని రాచబండమీద కాసేపు కూర్చుంటాడు) దీనికంతా చంద్రయ్య కారణము. చంద్రయ్యలాంటి విషపురుగు సంఘములో వున్నన్నాళ్ళు మన సంఘాలు అధోగతిపాలు కావలసిందే. కాబట్టి చంద్రయ్యనే వేరుచేస్తాను. జ్యోతి, మనోహర్, సుధాకర్ జీవితాలను ఆనందమయము చేస్తాను.

'చంద్రయ్యా! ముగిశనా ఈ గాథా' అంటూ నవ్వుతూ వెళ్ళిపోతాడు.

(తెర)

సశేషము

# చంద్రునిలోని మచ్చ

కుమారి దొండపాటి వసుంధరాదేవి

---

పూర్వమెప్పుడో ఒక మహారణ్యములో కుందేలు, నక్క, లేడి, కోతి స్నేహంగా నివసిస్తుండేవి. వానిలో కుందేలు తెలివి తేటలు కలది. ప్రతిరోజు అది మిగిలిన మృగాలకు చిన్నచిన్న కథలు చెప్పి వినోద ఉల్లాసాలను కలిగిస్తుండేది.

ఆ రోజు శుక్లపక్ష చతుర్దశి. పిండార పోసినట్లున్న వెన్నెలలో ఆ నాలుగు మృగాలు చేరి కుందేలును ఎప్పటియట్లు కథ చెప్పమని అడిగాయి.

కుందేలు చంద్రుణ్ణి చూపిస్తూ "రేపు పౌర్ణమి కాబోలు! చంద్రుణ్ణిచూచారా - ఎంత గుండ్రంగా, పెద్దదిగా వెన్నెలను వెదజల్లుతున్నాడో! చాలమంది రేపు పగలు ఉపోష్యముండి సాయంకాలానికి మునీశ్వరులకైనా, అతిథి అభ్యాగతులకైనా తృప్తిగా భోజనముపెట్టి తాము చంద్రదర్శనమయిన తర్వాత భోంచేస్తారు. అలా చేస్తే చాలపుణ్యము. కాబట్టి రేపు మనమంతాకూడ అలాగునే చేస్తాము" అన్నది. అందుకు సరేనని తలలూపి దేని నివాసానికది వెళ్లింది.

కుందేలు మరునాడుదయమే లేచి తన నివాసముముందు పడియున్న గడ్డినిచూచి "సాయంకాలానికి నాకు ఆహారంగా యీ గడ్డి సరిపోతుంది. కాని అతిథి సత్కారానికి ఏమిచెయ్యడం!-మనుష్యులు గడ్డిని తినరు- కాని వారికి కుందేటి మాంసమన్న ప్రీతి మెండు. కాబట్టి వారికి నా మాంసమే ఆహారంగా పెడ్తాను" అనుకుంది.

నక్క ఉదయం చీకటియుండగానే లేచి "సాయంకాలమువరకు ఆహారములేకుండా యుంటే శోషవస్తుందేమో! అలా కాక పోయినాఅప్పటికప్పుడు ఆహారందొరకేను- దొరకక పోయేను, కాబట్టి యీ లోపలనే ఆహారం సంపాదించి తెచ్చి పెట్టుకోడం మంచిద"ను కొని బయలుదేరివెళ్లి మాంసాన్ని సేకరించి యితరులకంట బడనీయ కుండా తెచ్చి పెట్టుకుంది. అలాగే కోతి, లేడి, కూడ ఆహారమును సేకరించుకొని నివాసాలలో తెచ్చి పెట్టుకొనినవి.

దేవేంద్రుడు యీ నాలుగు మృగాల మనస్తత్వాలను దివ్యదృష్టితో తెలుసుకొని కుందేలును పరీక్షింపదలచి ఒక సన్యాసి రూపంతో కుందేటి నివాసానికరిగి "ఆకలితీర్చుము" అని అడిగాడు.

కుందేలు పరమానందంతో "స్వామీ! తమకు భోజ్యయోగ్యములు నాకడ ఏమియు

(381 పేజీ చూడుడు)

# నవీన విద్యా వేత్తలు,

# మాంటుసారీ మాత

డాక్టరు వి. ఎన్. శర్మ



నవీన విద్యావేత్తలలో డాక్టరు మాంటిసోరీ ఒక అపూర్వ వ్యక్తి. నూతన విద్యా విధానమునందు ఆమె బోధనాపద్ధతులు తెచ్చిన విప్లవము లోకవిదితమైయున్నది. ప్రపంచములో ఏదేశమునకు బోయినను ఆమె పద్ధతుల ననుసరించువారిని జూడనగుననిన, అదియొక అతిశయోక్తిగాదు.

ప్రతిదేశమువారును వారిదేశ సాంప్రదాయముల ననుసరించి తమ బిడ్డలకు విద్యాబుద్ధులు గరపబోవుట సహజము. ఆ సాంప్రదాయములు ఆయాకాలపు సాంఘిక, రాజకీయ, ఆర్థిక స్థితులనుబట్టియు, మత తత్వములను బట్టియుగూడ మారుచుండును. అట్టి మార్పులవలని దెబ్బ మొదట విద్యాలయములకును, అందలి విద్యార్థులకును దగులును. నాయకులు రాజకీయ పక్షములకు జెందినవారైనను, సాంఘిక సంస్థలకు సంబంధించినవారైనను, మతస్వాములైనను తమ జీవితమును సుఖముగను, సునాయాసముగను గడుపువారేయై యుందురు. అది రామరాజ్యమేకానిండు; లేదా రావణుడే చక్రమును ద్రిప్పనిండు. తమ కడుపులో చల్ల కదలకున్నంతవరకును వారికే విప్లవములతోను నిమిత్తములేదు. దేశచరిత్రల బరిశీలించినచో మనకు ద్యోతకమగు తత్వమిదియేయైయున్నది. కాని ఒక దేశములో నొక విప్లవము సంభవించిన అది యాదేశపు పొలిమేరలతో నాగిపోదు. అది దేశ దేశాంతరములకును ప్రాకిపోవుట సహజము. అట్టి సహజ పరిణామమును తప్పించుకొనుట మానవమాత్రునకు శక్యమగుపనిగాదు.

గతమూడు శతాబ్దములలో ప్రపంచమంతటను, అందు ముఖ్యముగా పాశ్చాత్య దేశములలో నిప్పుల వర్షము కురిసినది. అది మానవుని సహజ వికాసమున కడ్డుపడినది. మానవుడొక అచ్చుబొమ్మయనియు అతడు నిజముగు మానవమాత్రుడగుటయు, కాకుండుటయు, అతనికి గరపు విద్యమీదనే ఆధారపడియుండుననియు, శాస్త్రవేత్తల ఉద్దేశములై యుండెను. మతాచార్యులు సహితము ప్రత్యక్షముగా గాకున్నను పరోక్షమందైనను ఈ సిద్ధాంతమునే అన్ని రీతుల నిలబెట్ట ప్రయత్నించిరి. వారికి కావలసిన దొక్కటే! అదియేమన — ప్రజలందరును, అందు ముఖ్యముగా విద్యార్థి లోకమంతయు తమ మత సిద్ధాంతములను, జాతీయ సాంప్రదాయములను అనుసరింపవలెను. దాని కనుగుణ్యముగ బిడ్డల నదుపుననుంచి విద్యాబోధలు సలుపవలెను. ప్రభుత్వ రథములను నడపువారును ఇట్టి అభిప్రాయములతో నేకీభవించువారే యగుచుండిరి. అందుచే రాజకీయ నాయకుల కన్న మతాచార్యులకే పలుకుబడి హెచ్చుగనుండి ప్రభుత్వములను తమ యుద్దేశ్యముల ననుసరింప జేయుట వారికి సులభమయ్యెను.

అట్టి పరిస్థితులలో విద్యా విధానమున సరళ పద్ధతులకును, ఉదార భావములకును తావులేకుండెను. అందుచే విద్యాపద్ధతులు సనాతనమయినవిగాక, ఆధునికమయినవియుగాక అయోమయమైయుండెను. విద్యాలయములును, కళాశాలలును వట్టి యంత్రాగారములై పిల్లలందలి ముడివస్తువులైరి. ఆ ముడివస్తువులనుండి

బెల్జియములో De Croly, అమెరికాలో Dewey, ఇంగ్లాండులో Neil, ఇటలీలో Montessori నూతన విద్యాసంస్థలను నెలకొల్పి నవీనభావములను తమ విద్యాపద్ధతులం దాచరణలో బెట్టి ధన్యులనిపించుకొనిరి.

పైవారిలో ననేకులగూర్చి మీరు త్వరలో దెలిసికొనగలరు. బాలప్రపంచమునకు నిరంతర సేవజేసి, రెండేండ్ల క్రిందనే కీర్తిశేషులైన మాంటుసారీమాతను గూర్చియే మనమిట తెలిసికొందము. ఈమె ఇటలీలో ఒక కుగ్రామమున, చియరవల్లి అనుచోట, 1870 సంవత్సరమున జన్మించెను. ఇటలీ విద్యాపద్ధతులు ఆకాలమున ఎట్టి స్వాతంత్ర్య భావములకును అవకాశము లిచ్చినవిగావు. ఆడువారు పాఠశాలలకుబోయి చదువుకొనుటయన్న సంఘము హర్షింపకుండెను. అట్టియెడ తన తలిదండ్రులు లంగీకరింపకున్నను మాంటుసారీ పట్టువదలక గ్రామవిద్యాలయములలోనే చదువుకొన్నది. గ్రామవాసుల దూషణలకును, ఇతర పిల్లలు గేలిచేయుటకును, ఉపాధ్యాయుల అనాదరణకును ఆమె లెక్కచేయలేదు. ఆమె స్వాతంత్ర్యవీర, విప్లవకారిణి. ఎన్నిటినైనను ఓర్చి ఆ గ్రామ పాఠశాలలోనే తన చదువును కొనసాగించుకొనెను. తరువాత ఉన్నత విద్యాభ్యాసమునకై చేరువనున్న పట్టణమునకుబోయి అచ్చట తాను చదువవలసిన చదువునంతను పూర్తిగ చదివెను. అటుపిమ్మట నామె వైద్యశాస్త్రము నభ్యసింప పూనుకొన్నది. తండ్రికిది సరిపడలేదు. చదివిన చదువు చాలును. ఇతర మర్యాద కుటుంబములలోవలెనే తన కూతురు పెండ్లిజేసికొని సుఖజీవనమును గడపుటయే మంచిదని అతని వాదన. కాని ఒక విప్లవ వ్యక్తి అట్టి వాదనలకు లోబడునా? తండ్రి ఇంటి నుండి వెలివేసినను ఎంతో వ్యయముతోగూడిన వైద్యవిద్య కతడొక చిల్లిగవ్వయైన నివ్వకున్నను మాంటిసారి తన లక్ష్యమును వదలలేదు. పట్టుదలతో అన్ని కష్టములను ఎదుర్కొని 1896 సం॥లో వైద్యశాస్త్రమున డాక్టరు పట్టమును పొందెను. ఇటలీలో ఇట్టి డాక్టరు పట్టముపొందినవారిలో నీమెయే ప్రథమ వనిత. సంఘమునందు స్త్రీలకును పురుషులతో సమాన హక్కులుగలవని చాటి వానిని సాధించుటకై ఈమె చేసినకృషి నిట వివరించుట కలవిగాదు. మన దేశములోవలెనే ఇటలీలోగూడ స్త్రీలకును, బిడ్డలకును వైద్యసహాయము తక్కువ. అందుచే వీరిలో మృత్యుదేవత కాహుతులగువారి సంఖ్య ఇంతింతయని చెప్పజాలము. అనేక వైద్యశాలలో మాంటిసారి రాత్రింబవళ్లు పనిచేయుచు స్త్రీలకును బిడ్డలకును చేసినసేవ కొకపరిమితిలేదు. అందులకే ఆమెపేరు ఒక ఇటలీలోనేగాక, ఆస్ట్రియా, జర్మనీ, ఫ్రాన్సు దేశములలోగూడ మారుమ్రోగెను. మాంటిసారీయొద్ద వైద్యసహాయము నర్థించి వచ్చెడి రోగుల సంఖ్య పెరుగజొచ్చెను. పిల్లలన్న నీమె కెక్కువ ప్రీతి. అందు అనాథ బాలబాలికలన్న ఆమె ప్రేమకు మేర లేదు. వారికి తగిన వాతావరణముల నేర్పరచుటకై యామె ఎన్నో సంస్థలను నెలకొల్పెను. పెక్కు విద్యాలయములను, అనాథ శరణాలయములను స్థాపించుటకై ప్రజలయొక్కయు, ప్రభుత్వముయొక్కయు సహాయమును, సానుభూతిని బడయుటకై ఈమెచేసిన ప్రయత్నములకును, పడ్డపాట్లకును లెక్కలేదు. బిడ్డలే దేశ పురోభివృద్ధికిని, లోకకల్యాణమునకును ఆధారములు; మార్గదర్శకులు. వారిని చక్కగ పెంచి పైకిదెచ్చినగాని మన ధర్మమును పూర్తిగ కొనసాగింపజాలము. ఈ ఉద్దేశములవలననే ఆమె బిడ్డల పురోభివృద్ధికి పట్టుదలతో నిరంతరకృషి చేయుటకై పూనుకొన్నది. వారికి నవీన పద్ధతులతో విద్యనుగరపుటకు ప్రథమ మాంటిసారీ విద్యాలయమును తన స్వంత ఖర్చులతో స్థాపించి దానికి "పిల్లల గృహము"ని పేరుపెట్టెను.

ఇటాలియను తత్త్వము చాలవరకు మనవారి తత్త్వమునకు అనుగుణ్యముగ నుండును. ధనికులు తమ బిడ్డలను గారాబముగా రాజఠీవితో పెంచి చెడగొట్టెదరు. పేదలు తమ బిడ్డలను డబ్బుసంపాదనకై పని చేయించి వినియోగించుకొందురు. ఇకనా పిల్లలు చిన్నచిన్న నేరములు మొదలుకొని పెద్దపెద్ద నేరములలోగూడ పాల్గొనుచుందురు. ఇకవారు పోలీసు

వినియోగింపవలెను. అప్పుడే లోకమందలి క్లిష్టసమస్యలన్నియు మటుమాయమై శాంతినిలువగలదు. నిజమగు స్వాతంత్ర్యము ప్రపంచమునకు లభ్యమై శుభముచేకూరగలదు. ఇదియే మాంటిసారీ మనకు ప్రసాదించిన మంత్రము. దీనిని ఆమెయనుచరులు చక్కగా గ్రహించి ఆచరణలో బెట్టుటకన్నిచోట్లను కృషి సలుపుచు తమ సర్వశక్తులను వినియోగించుచున్నారు.

ఈ మంత్ర శక్తి నందరకును బోధించుటకే ఈమె తన వృద్ధాప్యములో ప్రపంచ పర్యటనమును చేసెను. ఆపర్యటనమును గూర్చి వ్రాసిన అది యొక గొప్ప చరిత్రయగును. మొన్నటి రెండవ మహా సంగ్రామమునకు ముందు మాంటిసారీ మన దేశమునకువచ్చి మద్రాసునందేడు వత్సరములు గడపి మనలనందరను పావనముజేసినది. తాను కనుగొన్న రహస్యములన్నియు మన ప్రాచీన విద్యాపద్ధతులలోనే నిబిడీకృతమైయున్నవని ఆమె మనకు బోధించి మనకన్నులను తెరచినది. ఆ పద్ధతుల అంతరార్థమును గ్రహించి మన పిల్లలను మనమే యుద్ధరించుటకు ప్రోత్సహించినది.

మాంటిసారీ తన భౌతిక శరీరమును విడచిపోయినది కాని ఆమె యాత్మ చిరంజీవి. ఆమె విద్యారహస్యములను నేటి విద్యావేత్తలు బాగుగ గ్రహించవలెను. మనమందరమునుగూడ వాని నర్థముజేసికొనవలెను. అప్పుడే గురు శిష్య సాంప్రదాయములకు జీవము బోసిన వారమగుదుము. ఆమె ఆశయములననుసరించి లోక కల్యాణమునకును, ప్రపంచశాంతికిని సేవజేయుటకై ముందంజవేసిననాడే మనమామె పేరునునిలపిన వారమగుదుము. ఆమె ధర్మపథమును కొనసాగించిన వారమగుదుము.

# పొదుపు

శ్రీ సోమయాజుల శ్రీరామ దత్తాత్రేయశర్మ

(o)

గలసరుకులు సామానులు-పిలిచిన పలికెడు నటులను, పేర్చినయెడలన్
కలకలలాడును గేహము,-చెలువొందును నీధవుండు చేడియ వినుమా!

మూత లేనట్టి సరుకులు రోత వేయు-చేత ముట్టరు నీవారె చీదరింత్రు
గోతిపాలగు గావున మూతలిడర-వంత కూరిమిజూపుము వారిజాక్షి!

ఎప్పుడు నూతన సోయగ-మొప్పగ చరియింతువేని మురియుచు నీయం
దెప్పుడు ననురాగమ్మును-గొప్పగజూపును ధవుండు కోరిక దీర్చున్.

వంటకమ్ములు కమ్మగయుంట తోడ-వంట శాలయు వద్దన కంటి కెంతొ
యింపు సొంపులు వెలయించి పెంపు-మీర మధుర వాక్సుధ లొలికించు మంజుభాషి

బల్లి తొండల చొంగల పాలబడిన-చెల్లవనుచును వద్దన జేసినావొ
చెల్లు నాటితో పురుషుల చెలిమి సుఖము-తెల్లపరచితి చెల్లిరో కల్ల లేదు.

కాయగూరలు దుంపలు కలిగియుండి-ముందు దుంపల వేపుడు మొదలుపెట్టి
కూర లెండినవనుచును పారబోయ-యిల్లు గుల్లగు నమ్మరో కల్లగాదు.

మగనికి లేనట్టి పొదుపు మగువ కదేలని తలచుట మంచిది యగునా?
తగ నెడపెడ, వెలిగించగ-తగునా? కొవ్వొత్తి నిలను తరుణీమణిరో.

పొదుపు తెచ్చును యందము పొందికయును
పొదుపు పొదుపన పిసినారి పదము గాదు
యదను తెలిసియు పదనుగ ముదము మీర
సరస వెచ్చము జేయుటె చాన పొదుపు.

# బిసాతి

మూలం :
శ్రీ జయశంకరప్రసాదు

అనువాదం :
శ్రీమతి ముమ్మనేని ప్రతిభ

ఎత్తైవలయాకారముగనున్న కొండలవరుస. దాని మధ్య గుబురుకొని క్రమబద్ధముగ పెరిగిన చెట్లగుంపు. ఆ గుంపులో నొక చిన్నపల్లె. ఆ పల్లెలోనివన్నియు పూరిండ్లు. అయినను వసంతకాలములోని సుమ సౌరభ సమ్మిశ్రితమందపవనములా యూరి పూరిండ్లను సుగంధ సంభరితము లొనరించును. కలకలా రావములతో శ్రుతిహితి మొనరించుచు కొండకోనల నుండి హిమశీతల జలముల బ్రవహించు సెలయేళ్లు తమ బాహువల్లరిలో నా గ్రామమునిరికించుకొనియెంతో మనోహరముగనుండును. ఆ పాతరమణీయమగు నా ప్రదేశములో స్నిగ్ధమధుర సంగీతనినదమొకటి నిరంతరము వీనులకు విందొనరించుచునే యుండును. పికిలి పిట్టల కలనిస్వనమా సంగీతమందు సమ్మిశ్రితమై యానందాతిరేకమును కలిగించుచుండును.

దానిమ్మపూవుల యరుణారుణకాంతులు సంధ్యారాగకిరణ జాలముచే ద్విగుణీకృతముగ శోభిల్లుచున్నవి. శీరి దానిమ్మచెట్టుక్రిందగల శిలావితర్దికపై నాసీనయై యెట్టయెదుటనున్న గులాబి జొంపమును గాంచుచుండెను. అందు లెక్కకుమించిన పికిలిపిట్టలు సమీర కుమారునిగలిసి సయ్యాటలాడుచు స్వీయమంజు కుంజితముల నాకసమును ప్రతిధ్వనింపజేయుచుండెను.

శీరి యాకస్మికముగ తన తలపైనున్న ముసుగును తొలగించినది. ప్రకృతి ప్రసన్నయై, దరహాసమొనరించినది. గులాబిపూవులమధ్య శీరివదనము సుమరాజము వలె ప్రకాశించినది. నోటినిండుగ తేనెగ్రోలిన తేటి జంట యాసుమరాజమునుండి యెగిరిపోజాలకున్నది. వాని రెక్కలు నిస్పందములై యుండెను. కంటకాకీర్ణములగు నా గులాబి పొదలను లెక్కచేయక అందు వచ్చి దూరుచు మరల ఎగిరిపోవుచు స్వేచ్ఛావిహార మొనరించుచున్న నాపికిలి పిట్టల దుటుములను శీరి తన్మయురాలై చూచుచుండెను.

ఇంతలో నామె కూరిమి నెచ్చెలి జులేఖ యక్కడికరుగుదెంచుటతో శీరి యేకాంతమునకు గొంత భంగము వాటిల్లినది. "శీరి! నీ చేతిపై వ్రాలుచుండెడి పికిలిపిట్ట కొన్నాళ్లుగా కాన్పించుటలేదేమి?" యని జులేఖ తన యవగుంఠనమును తొలగించుచు శీరిని ప్రశ్నించెను.

"ఎముకలనుకొఱకు నాశీతవాతకాలమున తన దళముసుగూడి మైదానమునకు బయనమైపోయినది. ఇప్పుడు వసంతము వచ్చినను నా పికిలిపిట్ట మాత్రము తిరిగిరాలేద"ని ధీర్ఘముగ నిట్టూర్చి శీరి జవాబు చెప్పెను.

"అవి యన్నియు హిందుస్తానమున చాల దూరమేగునని వినియుందును; నిజమేనా శీరి!"

"ఔను జులేఖ! స్వేచ్ఛావిహారమన వానికెక్కువ మక్కువ. ఆ జాతిపక్షులు తమ స్వాతంత్ర్యమును ప్రాణతుల్యముగ భావించి ప్రేమించును."

"మెలికలు తిరిగిన నీయలకజాలములో దానినెందుకు బంధింపజాలక పోయితివి?"

"నెచ్చెలీ! జులేఖా! నా పాశమా పక్షికి వదులైనది."

"అయిన మంచిది. అది మరల తిరిగిరావచ్చునులే. విచారింపకు నేను పోయివత్తును."

దానికి సమాధానముగ శీరి తలపంకించినది.

జులేఖ వెళ్లిపోయినది.

♦ ♦ ♦

పర్వతాగ్రములపై నాకసమున సంధ్యాంగన స్వీయానురాగ రక్తిని వెదజల్లుచుండెను. పంక్తులు గట్టి పక్షులు నభోంతరాళమున పయనించి తమ తమ నడముల జేరుచుండెను. సమీర కుమారుడు తన వీచికాబాహువులజాచి రజనీవధూటిని తనలోనికి లాగుకొనుచుండెను. గులాబిపూవుగువ స్వీయసౌర భము నధికాధికముగ నితరులకు బంచియిచ్చి పచ్చని యాకు దుప్పటిచాటున మరుగువడ జూచుచున్నది. అట్టితరి శీరియొక్క ఆశాపూర సంబరపూరిత విశిష్ట దృష్టి నిశీధినీ కజ్జలకాలిమాభిభూతమై రెప్పలచాటున దాగికొనజొచ్చెను. ఆమె మేల్కాంచియు స్వప్నా వస్థయందువలె నిట్టి యనల్పకల్పనములకు లోనయ్యెను.

"భారతవర్షమున సిరిసంపదలతో తులతూగు ఒకానొక విశాలనగరి. అందుగల యిరుకుసందులో యువకుడొకడు మూపుపై మూటనుమోయుచు తిరుగు చున్నాడు. మించిన పరిశ్రమవలనను, ఆహారములేమి చేతను అతని వదనసీమ కళావిహీనముగనున్నది.. అలసి యతడొక యింటివాకిట కూరుచున్నాడు. ఏవేని కొన్ని వస్తువులనమ్మి నాటి కాజీవికను సంపాదించు కొన జూచుచున్నటుల నాతని దీనాలాపముల తెల్ల మగుచున్నది. అప్పీయదలంచిన 'నేదేనివస్తువునిమ్ము. లేనిచో ఇటనుండి వెళ్ళిపొమ్ము, తెలిసినదా సర దారూ !' అని యాయింటిగేస్తు పలికెను."

"అప్పిచ్చుశక్తి నాకులేదు. నీవేమియుకొన కున్నను నాకు పదివేలు" అని యా యువకుడు మారు పలికెను.

ఇట్టి కల్పనా సృష్టిలోబడి శీరి యులికిపడినది. తన సంపదనంతయును మూపుపై మోసికొని యాత్రి కుల గుంపుతోగలసి కైబరుకనుమలోని కష్టముల నామె స్వీయకల్పిత భావపరంపరతో పాదాక్రాంత మొనరించుకొనసాగినది.

అవసరములేకయే యా యువకునియొద్దగల సమస్త వస్తువులనుకొని యాతని భారమును తగ్గించుటకు ప్రతి భారతీయ గృహస్థునకు చాలినంత ధనము పంపింతునా యని శీరికి కోరికకలిగినది. కాని యమాయికయగు శీరి కోరికకుదగిన మొత్తమామెయొద్ద యెక్కడిది ? ఆమె తండ్రి పర్వత నివాసుల సరదారు. అతి క్రూరుడు. ఆమె తన తల పంకించి లోలోన నేదియో యాలోచింప దొడగినది.

దినకరునిపై సంధ్య యధికారము నెరపినది కాకులీకలనిస్వన మాగిపోయినది. శీరి నిట్టూర్పుతో సమీరసంచలన మాగిపోయినది. శీరి యొక శిలాఖండమునకు వీపును మోపుజేసి కూరుచుండెను.

దాసివచ్చి యామెను పలుకరించి "రాణిగారు మిమ్ము పిలుచుచున్నారు. గోరింతయాకు వచ్చినది" అనిచెప్పి వెళ్ళిపోయినది.

◆ ◆ ◆

ధనికుడగు సరదారునితో శీరికి పెండ్లి జరిగి కొన్ని నెలలు గడిచినవి. సెలయేటిగట్టునగల పూదోటలోని పూలమొక్కలు చక్కగ పూలుపూసినవి. వసంత మారుతా పూల మొత్తములోని వందలకొలది పూలకు తెంపలువేసి యేడిపించుచుండెను. తేనెసోనలు జొటజొటకార జొచ్చినవి. పికిలి పిట్టలు దానిదయ లేమికి క్రందనమొనర్చుచుండెను. శీరిదానినంతను సహిం చినది. సరదారుని ముఖముత్సాహపూరితమయ్యెను. ఇది జరిగిన దొక సుందర ప్రభాతవేళ.

పొడగరి,బలహీనుడునగు యువకుడొకడు మూపుపై పెద్ద మూటనిడుకొనివచ్చి యెదుట కూరుచుండెను. శీరి యాతని జూచినది. కాని యతడెవరిని జూడకతన సామానులు విప్పి యందముగ సర్దుకొనదొడగెను.

సరదారు తన ప్రేయసికి ఉపహారమునిచ్చు తలం పుతో గాజు పళ్ళెరములను, కాశ్మీర దేశముయొక్క సామానులను ఏరమొదలిడెను.

శీరి మిన్నకుండెను. ఆమె హృదయకాననమున కల రవాక్రందనము చెలరేగెను. సరదారు వస్తువుల వెల నడిగెను.

"వీనినుపహారముగ నిత్తునేగాని అమ్మజాలను. వీని నేరి తెచ్చితిని. ఇందు మూల్యమేగాక యమూల్యమగు

హృదయముగూడ నిమిడియున్నది” అని యువకుడనెను.

“అయిన నాకీవస్తువులవసరములేదు. కొని పొమ్మంటిమ్మని” పరుషస్వరముతో సరదారుపలికెను.

“మంచిది అట్లే కొనిపోయెదనులే. మార్గాయాసముచే మిగుల డస్సియున్నాడను. కొంచెమాగుడు. కాలుసేతులు కడిగికొనివత్తును,” అనియా యువకుడు గద్గద స్వరముతో బలికి కన్నీటికనులను గానరానీయక ఆటనుండి వెళ్లిపోయెను.

అతడు సెల యేటికి బోయి యుండునని సరదారు తలంచెను. కొంతతడవైనది. కానియతడు తిరిగి రాలేదు. శీరి హృదయమునకు దానివలన దెబ్బతగిలినది. దయా విహీనతకు పెనుబాధ యామె నావరించినది. గుండెపై చేయి వైచుకొని శీరి గులాబిపొదపై పుచూడ దొడగినది. కాని కన్నీటి వెల్లువలు పెల్లుబుక నామె కనులకేమియు గోచరించుటలేదు. సరదారు ప్రేమతో నామె వీపు తట్టుచు “ప్రేయసీ! నీవుచూచునదేమి?” యని శీరిని పలుకరించెను.

“పెంపుడు పికిలిపిట్ట నాదొకటి శీతకాలమున హిందూదేశమున కెగిరి పోయినది. తిరిగి నాకది నేటి ప్రభాతమున గనుపించినది. అది నా సమీపమునకు వచ్చినపుడు దానిని నే పట్టజూచితిని; కాని యింతలో నది కొండలోయలదారిబట్టి యెగిరిపోయినది” అని శీరి కంపితస్వరమును కప్పిపుచ్చుచు కడుజాగరూకతతో సరదారునకు సమాధానము చెప్పినది. “భేష్! పూవులు పికిలిపిట్టకై యెదురుచూచునా! ఆశ్చర్యముగానే యున్నది”యని సరదారు మారు పలికెను.

బిసాతి తన సామానులు వదలి వెళ్లిపోయెను: మరల తిరిగిరాలేదు. శీరి బిసాతి బరువుదింపినది; కాని దానివెల మాత్రము చెల్లింపలేదు.

---

చాలకాలమునుండి ఉద్యోగం, సద్యోగం లేకుండా యింట్లోనే యుంటున్న అల్లునితో మామ “ఏ షాపులోనైనా ఉద్యోగం సంపాదించరాదూ! నీ వయస్సులో నేను 20 రూపాయల జీతానికి ఒక షాపులో చేరి అయిదేండ్లలో ఆ షాపునే స్వాధీనంచేసికున్నాను” అన్నాడు. “అది ఆరోజుల్లో - యీ రోజులలో లెక్క పద్దు పుస్తకాలంటూ యుంటున్నవి”

---

# హిందూ స్త్రీలపై నవీన నాగరికతా ప్రభావం

శ్రీమతి చెరుకువాడ సుదక్షిణాదేవి

హిందూదేశంలో ప్రాచీన కాలము నుండియుకూడా ఒక విశిష్టస్థానమివ్వబడింది స్త్రీకి. అంటే పౌరాణికంగా చూచినా చారిత్రాత్మకంగాచూచినా తగిన గౌరవ ప్రతిపత్తులుగలవని తెలుస్తుంది. అంతే కాదు పురుషునితో సమానమైన స్థానం సంఘంలో, జాతిలో–మొత్తం దేశంలో లభించింద. మొదట అర్ధనారీశ్వరుణ్ణి తీసుకోండి. అంటే జాతి నిర్మాణానికి సంఘపురోభివృద్ధికి స్త్రీ పురుషులావశ్యకత గలదని తెలుస్తున్నది. అనగా జీవితా వసర వస్తు సముపార్జనకేమి, జీవిత వికాసానికేమి, రెండు నేత్రాలు, రెండు కాళ్లు, రెండు చేతులు, ఎంత అవసరమో అంత అవశ్యకములుగా గుర్తించారు. అయితే 'హిందూనారి' యేనా యింత ముఖ్య స్థానం, విశిష్టస్థానం అలంకరించింది? పాశ్చాత్యదేశాల్లో పాశ్చాత్య మహిళలు లేరా? అని అడగవచ్చు. ఆ ప్రశ్నకు సమాధానం ముందు వివరిస్తా.

పురాణ యుగంలో కుంతి, ద్రౌపది, ఉత్తర, సత్యభామల ధైర్యసాహసాలు, మనకందరకు సుపరిచితమే. అంతకుముందు వేదయుగంలో మైత్రి, గార్గేయి, ఋషిక మొదలగు వారి జ్ఞానతృష్ణ, వైరాగ్య ప్రతిపత్తులు మనకగుపిస్తాయి. భక్తి విషయకంగా రాధ, శబరి, మీరా, శారదాదేవి మున్నగు ప్రముఖులు కనుపిస్తారు. అంటే ఒక విషయంలోగాక అన్ని రంగాల్లో, అన్ని విషయాల్లో 'భారతనారి'కి ఉత్తమస్థానం యిచ్చారు.

సరే యిక చారిత్రాత్మకంగా చూద్దాం! పల్నాటి వీరగాథకు కారకురాలైన నాగమ్మ, రుద్రమదేవి, రాణీ సంయుక్త, పద్మిని, ఖడ్గతిక్కనపత్ని మున్నగువారి త్యాగ సౌశీల్యములు, రాజ్యాంగ చతురత, శౌర్య, ధైర్య, సాహసములు, ప్రత్యుత్పన్న దర్శకములు. అంతేగాక నూరు సంవత్సరములనాటి మహారాణి ఝాన్సీ లక్ష్మిబాయి యుద్ధప్రజ్ఞా ప్రతిభలు అనన్యములని వేనోళ్ల కొనియాడబడినవి. విద్యా విషయకంగా పాండిత్య ప్రకర్షలకును కొదవలేదు. తోరూదత్తు, కుమ్మరిమొల్ల, విమలాదేవి, వీరమతి, సరోజినీనాయుడు, రానడే, మహాదేవివర్మ, ఉషాదేవిమిత్ర మొదలైన వారున్నారు. వీరశివాజీ తల్లి 'జీ జీ బాయి' ఆదర్శపురుషుడు మహాత్ముని తల్లి 'పుతలీబాయి'కూడా విశిష్టత గల మహిళలే.

వీరు అంటే దేశవ్యాప్తంగా సుపరిచితులై ఖ్యాతికెక్కినవారు. అయితే నామరూపాలులేని ఎంతమంది మహిళలు ఈ కాలచక్రంలో మరుగున బడ్డారో మనకు తెలియదు.

నిన్నా మొన్నటి స్వాతంత్ర్య రణరంగంలో పురుషులేకాదు స్త్రీలుకూడ తమ దేశస్వాతంత్ర్యానికి ఉష్ణరక్తాన్ని ధారవోసినారు. కస్తూరిబా, కమలా నెహూ్రి, విజయలక్ష్మి పండిట్, కమలాదేవి చటోపాధ్యాయ, సరోజినీనాయుడు, దుర్గాబాయి, మొదలైనవారు. వీరేగాక ప్రాంతీయులైన పెక్కుమంది స్త్రీలు తమ త్యాగాన్ని నిరూపించి తమ జాతిలో, సంఘంలో ప్రముఖులైనారు.

సంఘనిర్మాణానికి, దేశసుభిక్షానికి స్త్రీల సహకారం అవసరం. అవసరం అని గుర్తించారు మన భారతీయులు. అందుకనే మహాత్ముడు తన నిర్మాణ కార్యక్రమ సూత్రాల్లో స్త్రీలకుకూడా స్థానం యిచ్చాడు. మనజాతికి స్త్రీ తలజని గుర్తించారు. జాతిలో చైతన్యం వున్నదంటే, సంఘంలో నవీనోత్సాహాలున్నాయంటే దానికి స్త్రీయే కారకురాలన్నమాట. మన భారతీయ నారికి మాతృస్థానం, సోదరిస్థానం యిచ్చారు. జాతికి మూలశక్తి, ఆదిశక్తిగా విశ్వసించారు.

మొదటగాఎదుర్కొన్న ప్రశ్న పాశ్చాత్యులు స్త్రీని గౌరవించరా? అన్న విషయం. అంటే వారు స్త్రీని ఒక భోగింపదగిన వస్తువుగా చూస్తారు. విషయ సుఖాలకెరగా భావిస్తారు. ఆ జీవ పదార్థాన్ని తమ నీచ కామవాంఛకు బలిగా విస్తారు. గులాబిపువ్వులోని సౌకుమార్యం, సౌందర్యం శోభలనుత్రుంచి అనుభవించాలంటాడు పాశ్చాత్యుడు. చూచి ముగ్ధుడై ఆనంద బ్రహ్మోపాసకుడు కావాలంటాడు భారతీయుడు. ప్రపంచంలోని ఆనందం, సుఖం, అంతా నాకే అంటాడు పాశ్చాత్యుడు. అందరికీ జన్మహక్కు అంటాడు భారతీయుడు.

ఇంతకీ భారత నారీస్థానం నైతికంగా, రాజకీయంగా, ఆధ్యాత్మికంగా అన్ని రంగాల్లో ఏవిధంగా చూచినా ప్రసిద్ధమూ, ప్రముఖమూను. జాతిపురోగమనానికి స్త్రీ ఒక ముఖ్య, ఆధారంగా గుర్తించింది. ఈ నాడుగాదు- ఏనాడో. ఆ గౌరవం భారత దేశానిదే. ఆ ఖ్యాతి భారతీయులదే. సంఘంలో స్త్రీయేనాడూ పతిత కాదు. పుణ్యాంగన. పసుపుకుంకుమలతో శోభించే పావనచరిత, శాంతిదూత, సౌఖ్యప్రదాయిని అని విశ్వసించింది భారతదేశం.

కాని నేడు మన భారత నారీస్థానం ఏమిటి? అని ప్రశ్నించినట్లయితే అన్ని

విధాలా వెనుకబడినట్లే కనుపిస్తుంది. నవీన నాగరికతా ప్రభావమో, లేక పాశ్చాత్య విద్యాసంస్కృతుల ప్రభావమో-నేడు ఏవిషయంలోచూచినా అసంతృప్తిగానేవుంది. అంటే శారీరకంగా, మానసికంగా, నైతికంగా బలహీనులై పోతున్నారు. వెనుకటి స్త్రీలనుబట్టి పోల్చి చూచినట్లైతే చాలా అడుగునబడిపోతున్నాము.

వెనుకటి స్త్రీలు ఫేస్ పౌడర్లు, ప్లాస్టిక్ సామాన్లు, గోళ్లరంగులు, జుట్టురంగులు, మొదలైన ఆధునిక నాగరికతా చిహ్నాలేమీ ఎఱుగరు. కాఫీ, ఓవల్ టైన్, ఫ్రూట్ జ్యూస్(పండ్లరసాలు) టానిక్ లు, యింజక్షనులు, విటమిన్ కాంప్లెక్స్ లు ఏవీ కనీ, వినీ యెరుగరు. నేడు వాటి ఆవశ్యకత ఏమిటి? అని ప్రశ్నించ నక్కరలేదు. ఏ ఆస్పత్రి చూచినా, ఏ విద్యాసంస్థ జూచినా, ఏ ప్రభుత్వోద్యోగ శాఖచూచినా స్త్రీలే యెక్కువగా కనుపిస్తున్నారు. ఇదంతా చూచి ఆధునిక నాగరికతా ప్రభావమని, పాశ్చాత్య విద్యాప్రయోజనమేనని మోసపోతున్నాం.

దీనికంతటికీ మూలమైన శారీరక, మానసిక నైతిక బలాలకు దూరమై పోతున్నామని గ్రహించాలి. వెనుకటి స్త్రీలు స్వావలంబన పరులు. దైవభక్తిపరులు, ధర్మనిష్టాపరులు, ప్రేమ, సహకార భావాలు వారియందు హెచ్చుగా గోచరిస్తాయి. కానినేడీ లక్షణాలు మృగ్యము. పూర్వపు స్త్రీలు తమపని తాము స్వయంగా చేసుకొనుటయే గాక ఇతరులపనికి సహకరించేవారు. నేడు తమ పని తామే చేసుకోలేకుండావున్నారు; ఇతరులపనికేమి సహకరించగలరు? దైవభక్తి మూలంగా పాపభీతి, పుణ్యచింతన, మనోబలం, లభించేవి. నోములు, వ్రతముల పేరిట నియమబద్ధమైన, క్రమబద్ధమైన, సమభావం కలిగిన జీవిత విధాన మేర్పరచుకొనేవారు.

నేడు దైవభక్తి మొదలేలేదు. ఒకవేళ ఉన్నా ఆచరణలోకి వచ్చేటప్పటికి శూన్యం. ఉదారత, అతిథి సత్కార భావాలు పూర్తిగా హుళక్కి. అయితే నేటికాఫీ హోటళ్లు, భోజనహోటళ్లు వచ్చినతరువాత పైనచెప్పిన ఉదార, ఉన్నత లక్ష్యాలకు స్థానంలేకుండా పోయింది. శాంతి, దయ, ప్రేమ ఆదరణ భావాలులేవు. అంతవరదాకా ఎందుకు? వెనుకటి స్త్రీలకు, నేటి స్త్రీలకుగల తారతమ్యమిదేనని ఒక్కమాటలో చెప్పవచ్చును. అందుకే పెద్దనగారు:

> "వండ నలయదు వేవురువచ్చిరేని
> అన్నపూర్ణకు నుద్ది యానాతని గృహిణి,
> అతిథులేతేర నడికి రేయైన బెట్టు" ...
> ... ... ... ... ... ... ... ...

అని అన్నాడు. అంటే అతడొక స్త్రీని ప్రాచీన ఆదకాలతో చిత్రించాలను కున్నాడు-కాదు-చిత్రించాడు.

నేడు స్త్రీలుపయోగించే ఆధునిక నాగరికతతో ప్లాస్టిక్ ప్రపంచం ఒకటి వచ్చి పడింది. అంటే ఏదో ఒకటి రెండు మినహా మిగిలిన సర్వస్వం ప్లాస్టిక్‌మయం. అంటే జీవితావసరాలైన అన్నం, నీరు విడిచి, మిగిలినవన్నీ ప్లాస్టిక్ అంటే తప్పులేదేమో! బట్టలు, అనగా చీరెలు, గుమ్మాల తెరలు మొదలుకొని, గుండీలు, దువ్వెనలవఱకు పాకి పోయినాయి.

స్త్రీలలో సహజంగావుండే లలితకళానైపుణ్యం, చేతిపనులలోని నిపుణత్వం క్షీణించి పోతున్నాయి. ఇంత వఱకు చర్చించుకున్నది మానసిక, శారీరక బలహీనత ఎలావచ్చింది? అన్నవిషయం.

ఇఁక ఎప్పుడైతే మానసిక, శారీరక బలం శూన్యమవుతవో అప్పుడే నైతిక బలంకూడ మృగ్యం అంటే కొంతవఱకు సినిమా ప్రపంచంకూడా కారణమని అనుకుంటాను. ఏ కారణమైతే నేమి మొత్తానికి ఆధునిక నాగరికత పేరిట పొందినలాభంకంటె నష్టమేకనుపిస్తుంది.

వెనుకటి సదాచారాలను విడనాడిన నేటి మన నాగరికతకు గలస్థానం చూస్తే ఆశ్చర్యమేకలుగుతుంది. పూర్వపువారు క్రమబద్ధమైన జీవితం గడిపేవారు. స్థలకాల నియమము లేక ఏ పనినిగాని చేసి యెరుగరు. మనం ఒకగంట రాట్నం వడకలేము. ఒకగంట బాగా ఆలోచించి వ్రాయలేము. అంతదాకా ఎందుకు? ఒక అరమైలు దూరం నడువలేము. మనం మన ఇంద్రియాధీనబద్ధులం. మనోబలంలేదు. కష్టం, దుఃఖం, బాధవస్తే తాళుకోలేము. చిన్న నొప్పి, బాధ వచ్చినట్లైతే పెద్దహంగామా చేసి డాక్టర్ని పిలిచి ఇంజక్షను చేయిస్తాం. శరీరశ్రమ, మనోవ్యథ, ధనవ్యయం, ఇన్ని చేసినా తృప్తివుండదు. చాలవరకు గృహవైద్యమే చేసుకొనేవారు పూర్వకాలంలో. ఒక స్త్రీ వుంటే ఆమెకు రోగనిదానం, మందు, పథ్యం, అన్నీ తెలిసియుండేవి.

సరే ప్రస్తుతకాలంలో ఒకరిద్దరచ్చటచ్చట అట్టివారులేకపోలేదు. నెల్లూరులో పొణకా కనకమ్మగారు, రాజమండ్రిలో బత్తుల కామాక్షమ్మగారు మున్నగువృద్ధ నారీమణులు, ఆయుస్సునందేగాక, అనుభవంలోకూడ వృద్ధులై తలపండిన తల్లులున్నారు.

నేటి ఆధునిక నాగరికత పూర్తిగా తలక్రిందులుగా మార్చేసింది. ఈ మార్పు నుండి ఎప్పటికైనా విముక్తి లభిస్తుందేమో! మన ఫాషన్లన్నీ వెనుకటివే తిరిగి క్రొత్త పేర్లతో బయటికి వస్తున్నాయి. అలాగే

ఆచార, విచారాలు, మర్యాదలు, కూడ తిరిగి సంఘంలోకి, జాతిలోనికి, దేశంలోనికి వస్తాయని ఆశిద్దాం.

ప్రాచీన సంస్కృతి, సభ్యతలను కొంత నవీన మార్గాల్లో నడిపించి భావి భారత దేశానికి, నవ్యాంధ్ర రాష్ట్రము క్రొత్త పోకడలతో ప్రాత వెలుగును తిరిగి ప్రకాశింప జేయుచు, నవీనమార్గం చూపగలదని ఆశిస్తాను.



"ఏమండోయ్! కుక్కలు యీభవనంలోకి రాగూడదు."

"ఈ కుక్క నాది కాదు"

"మీదికాదా! - మీ వెంబడేయున్నదే!"

"నీవూ అంతేగా!

# "అనూరాధ"

శ్రీ 'విజయ - రాఘవ'



రాంచరణ్ యిప్పటికి మేనత్త యింట్లోంచి లేచొచ్చేసి అయిదార్నెల్లు కావస్తోంది. అతను లేవడానికి కారణం, అతనికే తెలియలేదు లేచేంతవరకు. తన తల్లిదండ్రులు చనిపోయిననాటినుంచి ప్రేమతో పెంచింది మేనత్త ఉదయిని. ఆ పెంపకంలోగల మార్దవం రక్తసంబంధమైన నాన్నకు సయాన చెల్లెలు కాబట్టే. యీనాటివరకు ఉదయిని పెంపకాన్ని గుర్తుకు తెచ్చుకుంటే "అమ్మా-నాన్న వుంటే యింకేలాగు పెంచేవారో" అని పిస్తూండేది.

ఏవిషయంలోనూకూడా రాంచరణ్‌ని పల్లెత్తు మాటని యెరుగదు ఉదయిని. అనవసరంగా ఒకళ్ళ మనస్సుని కష్టపెట్టే తత్వం కాదామెది. ఇప్పటికీ రాంచరణ్ ఎంత వేరుగా వున్నప్పటికి, ఉదయిని రోజుకొక తూరైనా ఆ కాళీబజారుగుండావచ్చి, చటర్జీగారింటిముందు నిలబడి-

"రాంచరణ్ వున్నాడా ?" అని అడక్కుండా కాపలావాణ్ణి వెళ్ళేదికాదు. వీలైతే చూసివెళ్ళేది కూడాను. అటువంటప్పుడు రాంచరణ్‌కి చమత్కారం పెల్లుబికి మాట్లాడాలనిపించేది, ఉదయిని తన్ను గురించి ప్రత్యేకంగా క్షేమసమాచారాలు తెలుసుకొంటున్నప్పుడల్లా.

రాంచరణ్ మేనత్త యింట్లోంచి వచ్చేనాడే. ఉదయిని-

"చరణ్ ! నేనున్నానుగా, యింతకాలంబట్టి నిన్నుపెంచి, చదువు సంధ్యలు చెప్పించాను. మీ అమ్మ నిన్ను పెంచమని, కళ్ళార చూసుకోమని చెప్పి చేతిలో చేయ్యించి కండ్లు మూసింది. యింత వరకు నీకేవిధంగానూ కష్టంకలుగచేయలేదు. త్రిపాఠీ మామయ్య యేదో గొణుకున్నంత మాత్రాన యింత యిదిగా నామీద నీతకన్ను వేసి, నీ వొక్కడవే యీ విధంగా వుండటం బాగుండలేదు" అని కళ్ళ నీళ్ల పర్యంతంగా అంటుంటే జేబురుమాల్‌తో వచ్చే దుఃఖాన్ని ఆపుకొంటూ-

"వస్తానత్తయ్యా" - అని రాంచరణ్ సింహద్వారం గుమ్మందాటి వస్తుంటే మొక్కలకు నీళ్లు పోస్తున్న 'అనూరాధ' నిశ్చేష్టతరాలై, మొగం మీద గాలికి చెదిరిన ముంగురులని తడిచేత్తో పైకి తీసికొంటూ,

"ఎక్కడికి బావా !" అంది.

రాంచరణ్ జవాబివ్వడానికి సిద్ధంగాలేడు' ఏమని యిచ్చినా, దానికి ప్రయోజనం, ఘనత' గౌరవం వుండవని తెలుసు. హఠాత్తుగా యీ విధంగా బావ బయలుదేరి వెళ్ళిపోవటం వింతగా కనిపించింది అనూరాధకు.

వెళ్లిపోయేబావవెనక, వుదయిని అనేమాటలు వింటుంటే సంగతి గ్రహించి కళ్లవెంట నీళ్లు తిరిగినయి. ఉదయిని దగ్గరగావచ్చి మెల్లిగా భుజంమీద అనుకొంది. రాంచరణ్ పెద్దవీధిలోకి వచ్చేసెయ్యడం కని

పించింది. కాని యెక్కడకు వెడతాడో వూహించ లేకపోయారు.

అనూరాధ వుత్తరాలుచదివి అర్థంచేసుకొని జవాబు వ్రాయడానికి, పుస్తకాలుచదివి వుల్లాసాన్ని, వుత్సాహాన్ని పొందడానికి పనికివచ్చే చదువు మాత్రం నేర్చుకొంది. త్రిపాఠీ - ఉదయినుల యేకైక రాజుపట్టి అనూరాధ. త్రిపాఠీకి మొగపిల్లలు లేక పోవటంచేత యేమీ బాధపడేరకంగాదు. కాని ఉదయిని చాలా వేదనపడేమనిషి. రాంచరణ్ యెలాగో ఉదయిని యింట్లోవుండి చదువుకొంటూ న్నాడు. రాంచరణ్ కి ఉదయినిమాటలంటే మాత్రం చాలా లక్ష్యం. ఇక ఎవరిమాటను అంత శ్రద్ధ చూపేవాడు కాదు. అనూరాధ ఒకటి రెండు సంవత్సరాలు వయస్సులో చిన్న. రాంచరణ్ బుద్ధి తెలిసిన దగ్గరనుండీ ఉదయినిచేతిలో పెరగటంవల్ల అనూరాధ తనకు మరదలవుతుందని తెలియదు. తనతో పెరుగుతున్న 'అనూరాధ'ను చెల్లెలుగా భావించి రోజులు గడిపేవాడు.

పగలల్లా పుస్తకాలు చదవడం, రాత్రిళ్లు పొద్దు పోయేంతవరకు వ్రాసుకుంటూ కూర్చొనేవాడు. ఉదయినికి ఏంవ్రాస్తున్నాడో, ఏంచదువుతున్నాడో తెలుసుకోవాలని యిచ్ఛవుండేదికాదు. ఏనాడూ ఆమె మాట వరుసకైనా, 'అనూరాధ' నీకు మరదలవుతుందనికూడా అనలేదు. తనకు బాగా ప్రపంచమంటే అర్థమయి, నాల్గుకథలు అ, ఆ పత్రికల్లో ప్రచురణయ్యేటప్పటికి, యేవో అనుభూతులు మధురంగావుండే పరిస్థితులలో 'అనూరాధ' తనకు మరదలని గ్రహించుకోగలిగాడు. యీ విషయం తెలుసుకోడానికి కారణం ఒకటుంది.

"పొద్దుపోయేదాకా వ్రాసుకొంటున్న ఒకనాటి రాత్రి సమయం" త్రిపాఠీ - ఉదయినుల సంభాషణ విన్నంతసేపువిని, చివరకు తేలిన విషయం 'అనురాధ' తనకు చెల్లెలుకాదని, ఆమెను తన కిచ్చి వివాహం చేద్దామని ఉదయిని అనడం, త్రిపాఠీ ఆ ప్రసంగాన్ని ఆమోదించకపోవడం, వ్రాస్తున్న ఆ నాటి రాత్రి తెలుసుకున్నాడు. అనేక పర్యాయములు ఉదయిని త్రిపాఠీకి చెప్పిచూసింది. కాని అతని మాటల్లో ప్రతిధ్వనించేవి, ప్రస్ఫుటించేవి - యివే.

"తల్లిదండ్రులను పోగొట్టుకున్నవాడు, చదువు తక్కువవాడు, ఆస్థికూడా చెప్పుకోతగినంతలేదు. మనింట్లో యింతకాలంబట్టి వుంటూవున్నవానికి యివ్వడం నాకేమి యిష్టంగాలేద"ని స్పష్టపరిచాడు.

యీ మాటలువినే రాంచరణ్ ఆపుకోలేని దుఃఖంతో, ఆవేదనా హృదయంతో ఆ యింట్లో వుండకుండా లేచొచ్చేడు.

ఇప్పుడు రాంచరణ్ యువకప్రాయం బాగా వున్నవాడు. వారాలు చేసుకొని బ్రతికి యెలాగో మిత్రుల ధనసహాయంతో బి. ఏ. పూర్తి చేసాడు. అనూరాధ కనిపించినా అప్పుడప్పుడు పల్కరించాలని పెదిమలవరకు మాటలొచ్చేవి. కాని బయటకు రానివ్వడానికి యిష్టముండేదికాదు.

ఉదయిని యింటివద్దవుండి కథలు వ్రాసేరోజుల్లో- పిచ్చాపాటీకోసం అనురాధ వస్తూండేది.

"చరణ్ బావా! ఆ కథ అలా వ్రాసావ్ గదా! యేమిటి అర్థం" అని అడుగుతూండేది. టూకీగా చెప్పితే సరిపోతుందనుకుంటే, దాన్ని అనుకోని పరిస్థితులలో విస్పృతం చేయాల్సొస్తూండేది. 'బావ' అనేపదంలో అర్థం తెలుసుకున్న తరువాతకూడా అనూరాధ అప్పుడప్పుడు తప్పటడుగులు వేస్తూండేది. ప్రక్కకొచ్చి చరణ్ భుజంమీద ఆనుకొని, అతనితోబాటు తనుకూడా పుస్తకంలోకి చూస్తూన్న సమయంలో చరణ్ చాలా తెలివిగా మందలించేవాడు. అనూరాధ నాలిక కొరుక్కుని సిగ్గు తొడిగేది. కాని ఆ సిగ్గు దొంతరలు ఆమె ముఖంలో అట్టేకాలం నిలవకపోవడానికి ఎంతోకాలం పట్టేదికాదు. నెమ్మదిగా - "బావా! నిన్ను తాకితే తప్పా?" అని అమాయికంగా ప్రశ్నించేది. చరణ్ దానికి సమాధానం చిరునవ్వుతోనే. అనూరాధకు ఆ

చిరునవ్వులోని అర్థం, అర్థంకాక "తప్పేనేమో" అనుకునేది. బావను తాకుతూ నిల్చుండటం ఆమె చేయాలని చేయడంకాదని మనస్సులో అనుకొంటూండేది. దీనికి రాంచరణ్ గట్టిగా ఒక్కసారైనా చెప్పినట్లైతే యింతగా ప్రవర్తించేదికాదేమో !

అయిదార్నెల్లయినా రాంచరణ్ మళ్లా తనింటికి వచ్చి వుండకపోయేటప్పటికి అనూరాధకు అదోలాగ వుండిపోతోంది. ఒకనాడు - వుదయిన్నే -

"అమ్మా ! చరణ్ బావ మనింటికిరాడా ?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు జవాబు యెలా యివ్వడమో తెలియలేదు ఉదయినికి.

చివరకు అనూరాధే ఒకనాడు అన్నాల దగ్గర తన వివాహ విషయంలో అమ్మా - నాన్న మాట్లాడుకునే మాటలు విన్నతరువాత తన సందేహ నివృత్తి చేసుకొంది. ఒకవేళ తానే స్వయంగా బావ దగ్గరకు వెళ్ళి నచ్చచెప్పితే వినడా ? బ్రతిమాలితేకూడా ఒప్పుకోడా ? అని పదేపదే తలపోసుకునేది. ఇదివరకటి మాదిరిగా బావ తనతో యిప్పుడు మాట్లాడటం లేదాయె ! ఎలా అతనితో యీ విషయాలన్నీ మాట్లాడాలి.

రాంచరణ్ గదిలో ఒకరోజు ఒంటిరిగా కూర్చొని వ్రాసుకొంటున్నాడు యేదో. గది తలుపులు మూసి వున్నాయి. కిటికీ తలుపులు మాత్రం పైభాగంలో తెరువబడి వున్నాయి. కొద్దిపాటిగాలి వీస్తోంది. వెన్నెల రాత్రిలో చటర్జీగారి పూలతోటలోని వాసనలు గుమ్మని గదిలో జొరబడుతున్నయి.

'రాత్రంతా పోయేవరకు యేంచేస్తున్నావ్ చరణ్' అని చటర్జీగారడిగేంతవరకు తలెత్తకుండా వ్రాతపని చేయడం అలవాటయిపోయింది.

'బావా' అంటూ మెల్లగా పిలిచిన కంఠస్వరానికి_

'ఎవరూ' అనే ప్రశ్నతో కుర్చీలోంచి లేచి తలుపు తెరచాడు చరణ్.

కళ్లు మసకలు కమ్మాయి అనుకోని పరిస్థితుల్లో 'అనూరాధ' ఆగమనానికి.

ఇంతకాలంబట్టి తన నివాస కార్యక్రమంలో రాత్రిపూట 'అనూరాధ' రావటం యిదే మొదటసారి. అర్థంకాని ఆశ్చర్యం ఆవరించింది.

'లోపలికి రమ్మ'ని తాను ముందు నడిచాడు. టేబిల్ దగ్గరకొచ్చి నిలబడింది అనూరాధ.

చరణ్ కుర్చీలో కూర్చొని, సిగరెట్ ముట్టించాడు.

'బావా !'

తలెత్తి చూసాడు.

అనూరాధ నిలబడేవుంది.

'కూర్చోరాదూ ! అనూ !'

చొక్కాగాని, బనీనుగాని తొడుక్కోకుండా ఒక్క పైజామాతోవున్న చరణ్‌ని ఒక్కసారి కళ్ళు పెద్దవిచేసి అవలోకించింది. ఎండిన ఆ గుండెను యింకా ప్రేమిస్తున్న ఆ సిగరెట్లనుచూస్తూ -

'బావా ! సిగరెట్లు కాల్చకు, గుండెచూడు యెలా యెండిపోతోందో' అంది అనూరాధ జాలిగా.

ఒక్క చిరునవ్వునవ్వి - అదైనా పెదిమల సరిహద్దులు దాటనివ్వకుండా-

"అనూ ! అనేక రకాలైన ఆవేదనలు, బాధలు యీ సిగరెట్లకన్న యెక్కువగా గుండెను పీల్చెయ్యవూ! తాళలేని వ్యథలలో, కాస్తో, కూస్తో వుత్సాహాన్ని కలిగించగలిగేవి యివే. ఎవరిచేత ఆదరించబడకపోయినా వీటిచేత మాత్రం ఆదరించబడుతున్నా" అని ఆఖరిసారి గట్టిగాపీల్చి పారవేశాడు.

అనూరాధకు సమాధానం తెలియలేదు సరిగదా ఆశ్చర్యం కలిగించింది. తనవంక చూస్తున్న చూపులో

ఏదో క్రొత్త వికాసం కనుపించి, తననేమో పరాయి వ్యక్తిగా భావించబడుతున్నట్లు అనుకొంది.

"బావా! నీవు సరిగా మాట్లాడవేం" అందీ సారి నిర్వేదంతో.

'ఏమని'

"ఇదివరకటిలాగా నువ్వు మాట్లాట్టంలేదు. యేదో చెప్పగూడనివి దాచుకొంటున్నావ్. మనస్సు విప్పి మాట్లాడటంలేదు" అని బేలమొగంతో అంది.

"అటువంటివి మాట్లాడిన రోజులు చాలా మంచివి. యిప్పుడవేమీ పనికిరావు."

రాంచరణ్ సమాధానాలు అనూరాధకు తికమకగా కనిపించాయి. తాను యేమని చెబుదామని వచ్చిందో అది మరిచిపోయింది. యిప్పుడు రాంచరణ్‌ని అర్థం చేసుకుంటానికి తన తెలివితేటలు చాలినట్లు కనిపించలేదు. ఎందుకు మనిషి యిలా మారిపోవలసివచ్చిందో తోచలేదు.

తను వ్యక్తిగతంగా యేమీ బావకు కష్టంకలిగించలేదు. అమ్మ - నాన్నతో యిష్టంలేక మాట్లాడకపోతే తనతో యెందుకు మాట్లాడగూడదు? ఇలా ఆలోచిస్తూండగా చేతిలో శుభలేఖ జారి క్రిందపడింది.

చరణ్ అది కనిపెట్టి, "అనూ! ఏమిటది?" అన్నాడు.

"బావా! ఇది శుభలేఖ" అంటూ కుడిచేత్తో అందించింది.

అందుకొని - విప్పి - బంగారు పూతాక్షరాల్ని చదివాడు. వ్రాస్తూన్న తెల్లకాగితాలమీద టపీ టపీమని కన్నీటి బిందువులు రాలాయి. అనూరాధ అప్రయత్నంగా పాదాలమీద మోకరిల్లుతూ—

"బావా! నన్ను దీవించవూ" అని గద్గదికంతో అంది.

చరణ్ ఆమె బుజాలు పుచ్చుకొని లేవనెత్తుతూ.

"అనూ! దీవించమంటావా"—

"నువ్వు పెళ్ళికి తప్పకుండా రావాలి."

సమాధానం నిశ్శబ్దంగా వుండిపోయింది.

పమిటచెంగుతో చెక్కిళ్లు తుడుచుకొంటూ—

"వెల్తున్నా బావా!"

చరణ్ నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ అల్మరా దగ్గరకుపోయి తలుపుతీసి అందులోంచి ఒక పొట్లంతీసి—

"అనూ! యిదే నా ప్రియమైన కానుక, నీ కింతకన్నా తగినటువంటిది యెలా యివ్వగలను. ఇది, శాశ్వతి రాత్రింబగళ్లు వెచ్చిస్తే సంపాదింపబడినది. తీసికో అనూ! యెప్పుడైనా మీ యింటికొస్తే జ్ఞాపకముంచుకొంటావ్‌గదూ! అమ్మకు నాన్నకు నా నమస్కారాలని చెప్పు" అని అంటూంటే చటర్జీగారి మల్లెపందిర దాటుకొంటూ సన్నజాజి పూపొదరింటిలోంచి అనూరాధ వీధిగేటుదాటి వెళ్ళిపోయింది. రాంచరణ్ గేటుముందు నిలబడి వెళ్ళిన దిక్కువంక నిశ్చల నిరాశానేత్రుడయి ఆ వెన్నెల్లో చూస్తూ వుండిపోయాడు, అలాగే ఒక్క పది నిమిషాలు.





# గుణపాఠం



'కాంతినాథ్'

ఆరోజున తిరిగి తిరిగివచ్చి చాలిపోయింది. చాలీచాలని ఆదాయంతో ఏ రోజుకారోజు నిత్యావసరాలకు వెతుక్కుంటూ జీవయాత్ర సాగిస్తున్న మాకుటుంబము పట్ల సానుభూతి చూపుతున్న వాళ్లను తలచుకుంటూ, మా డబ్బును తమ స్వంతఅవసరాలను గడుపుకోడానికి వినియోగించుకొని సంవత్సరాల పర్యంతం మమ్ములను నానాబాధలకు, యిబ్బందులకు, కష్టాలకు గురిచేస్తూన్న అయోగ్యుడు జగ్గయ్య-పిల్లనిచ్చిన మామయైనా నరరూపరాక్షసుడు కాక మరేమిటా అనుకుంటూ సంధ్యాకాలపు పిల్లగాలుల చల్లదనానికి చాపమీద మా చిన్నమ్మాయి ప్రక్కన ఒత్తిగిలాను. కండ్లుమూతలు బడినాయి

'అది గ్రంథాలయావరణ. ఎవరికి కావలసిన గ్రంథాలను వారు తీసికొని చదువుకుంటున్నారు. నేనూ చదవాలని ఒక గ్రంథాన్ని తీసికొని ముందుంచుకున్నాను-కాని చదువు సాగడంలేదు. ఏదో యూహలతో మరో ప్రపంచంలో విహరిస్తున్నాను. వెనుకగుండా మోహన్‌రావు వచ్చి ''ఎడిటరుగారు ఏదో ఆలోచనా సముద్రంలో నున్నట్లున్నారే'' అన్నాడు.

నేనేమి మాట్లాడలేదు. ప్రక్కనే యున్న గణేష్‌బాబు ''ఏముంటుంది - పది! రోజులే కదటరా కుమార్తె పెళ్లియుంది - మనలనందరినిపిలచి భోజనం పెట్టాలి కాబోలురా భగవంతుడా! అని అయియుంటుంది'' అన్నాడు.

నాతోబాటు వాళ్లు కొంచము సేపు కూర్చున్నారు. నేను లేచి ''వెళ్లివస్తా - కొద్దిగా అవసరమయిన పనియుంది'' అని వెళ్లిపోయాను.

మా యింట్లో వివాహ ప్రయత్నాలు జోరుగా సాగుతున్నవి. చుట్టాలు, స్నేహితులతో సందడి యింతా అంతా కాకుండా యున్నది. మాకనకమ్మ నివ్వనుద్దేశించింది మా మేనల్లుడికే కాబట్టి కట్నాలు, కానుకల విషయం ప్రస్తాపనకు రాకపోవడం నాకదేదో సావకాశమనిపించి పెండ్లి ప్రయత్నాలు బ్రహ్మాండంగా జరిగినవి. అంతా మేమే కాబట్టి లాంఛనాలు సయితం ఉభయుల ఒద్దికననుసరించినవి కదాయని నాయూహ.

విడిదిగృహంలో పెండ్లివాళ్లు వచ్చిదిగారు. పెండ్లి పందిట్లో మేళతాళాలు మ్రోగుతున్నవి. అక్కడున్నవాళ్లంతా వరునిరాకకు ఎదురు చూస్తున్నారు. ముహూర్త సమయం సమీపిస్తున్నకొద్దీ అందరితోబాటు నాకూ వరుడు రాకపోవ

డం ఆదుర్దా కలిగించింది. కారణమేమయి యుంటుందో విచారించి రమ్మని మా తమ్ముడిని పంపాను. — తెలియవచ్చిందేమిటంటే - తనతోటివాళ్లందరికి సైకిళ్లున్నవట; తనకూ సైకిలు కావాలని అల్లుని కోర్కి!

ఈ సంగతి తెలిసి నాకు చాల చీకాకేసింది. తనకు సైకిలు కావాలంటే యిప్పుడే అడగాలా! తర్వాత అడుగకూడదా, లేక యింతకుముందే అడుగకూడదా అనుకొని అయినా మాయమ్మాయి సుఖసౌభాగ్యాల నుద్దేశించి సరేనని సమ్మతించాను. పెండ్లికొడుకు పందిట్లోకి సపరివారంగా వచ్చాడు.

సాంప్రదాయప్రకారం లాంఛనాలూ, మర్యాదలు జరిగినవి. కాని వరుడు ఎంత సేపటికి గది వదలి వివాహవేదిక మీదికి రాకపోవడం అక్కడున్నవాళ్లందరిలోను చాల అలజడి కలిగించింది. నేనే స్వయంగా పోయి "ఏమిటమ్మాయి - యీ ఆలస్యానికి కారణం" అని మా చెల్లెలిని అడిగాను.

"ఏమిలేదన్నయ్యా! - తాను వచ్చే ఏడాది ఎలాగూ మద్రాసులో బి. ఎ. చదువబోతున్నాడుకదా. మీకు మద్రాసులో నున్న యిల్లును తానుండటానికి యిప్పుడు తన కెందుకివ్వకూడదు అని పెంకిపట్లు పడ్తున్నాడు రామం" అన్నది.

"ఇదంతా ఏమిటమ్మా, అటువంటి వేవైనా యుంటే తర్వాత చూసుకోకూడదూ! - యిప్పుడేనా యీ రాద్ధాంతము" అన్నాను విసుగుగా.

"అదేమో నన్నయ్యా! వాడికి ఎంత చెప్పినా వినడంలేదు" అని లోపలికి వెళ్లిపోయింది.

నేను అల్లుడికి ఎంతో నచ్చచెప్పాలని ప్రయత్నించాను. కాని లాభంలేక పోగా ఒక్క విసురున వెళ్లిపోయి "ఇటువంటి మాట నిలకడలేనట్టి వానికి, అశాస్త్రగాడికి నా పిల్లనివ్వడంలేదు" అని తారామండలంగా మండిపడ్డాను.

మా ఆవిడ కాళ్లా వేళ్లా బడి నలుగురిలో నవ్వుబాట్లుగానుంటుంది కాబట్టి ఒప్పుకోమని పట్టుబట్టి ఒప్పించింది. దాంతోనైనా మూడు ముళ్లు పడుతవి కదా యని ఆశించాను. కాని అప్పటికీ అల్లుడి వరాలకు అంతు కనుపించినట్లులేదు. పెండ్లి పెద్దల్లో ఒకాయనవచ్చి "శాస్త్రిగారూ! యింత ఖర్చుపెట్టి పెండ్లి చేస్తున్నారు; అల్లుడికి సైకిలు కొనిపెట్టానన్నారు, మద్రాసులోని యిల్లుయిస్తానన్నారు - వాడు బి. ఎ. పూర్తియయిన తర్వాత ఇంగ్లాండు పోయి బారిష్టరు చదువాలనుకుంటున్నాడట, అందుకుగాను అయే ఖర్చులో సగము భరించవలసియుంటుందని అంటున్నాడు. మరిమీరు—"—అన్నాడు.

నాకు ఒళ్లంతా కారం పూసినట్లయింది.

కోపాన్నణచుకొని "దానికి సమ్మతించక పోతే..." అన్నాను.

"తర్వాత ఆలోచించుకోవలసినవారు మీరే" అని పెండ్లిపెద్ద వెళ్లిపోయాడు.

నేనే స్వయంగా వరుడున్నచోటుకు వెళ్లి "నీవు కోరుతున్న కోర్కెలను ఆలోచించుకోడానికి కొంతటైమియ్యి - కక్కుర్తి పరిస్తే ఎలాగ! - ముహూర్తం వేళ మించిపోతున్నది లే"అన్నాను.

"అది తేలేంతవరకు పెండ్లి పీటలమీద కూర్చోను" అన్నాడు పెండ్లి కొడుకు.

నాకు ఒళ్లు తెలియని ఆవేశము, కోపము ఆవరించినాయి "నీవీ ముహూర్తాన పెండ్లికి సమ్మతించకపోతే లేచివెళ్లిపో - నీవుకాకపోతే యింకొకడవుతాడు" అని కేకలేసి వెళ్లిపోయాను.

ఇదంతాచూస్తున్నవాళ్లు నన్ను అప్పుడు వేదిక మీదచూచి ఆశ్చర్యచకితులై నేను చెప్పేది చెవులొగ్గి విన్నారు-"వివాహ కార్యక్రమంలో కొలది మార్పులు తప్పని సరియైనవి - వరుడుగా రామ్‌కు బదులుగా మరొకరిని నిర్ణయించబడుతూంది. వివాహముహూర్తంరాత్రి 8 గం. లకు" అని చెప్పి దిగి వెళ్లాను.

వివాహమహోత్సవంలో పాల్గొన వచ్చిన వారందరికి యీవిచిత్రపరిణామాలు అగమ్య గోచరంగానున్నాయి. రాత్రి ముహూర్తానికి కనకమ్మను, వచ్చినబంధువర్గములో నుండిన నరసింహారావుకు వైభవోపేతంగా వివాహంజరిగింది. నామేనల్లునికిస్తానని వాగ్దాన చేసిన వానికంటె ఎక్కువ సత్కారలాంఛనాలతో నరసింహారావును అల్లుణ్ణిచేసికున్నాము. "ఎవరురా! యీ నరసింహారావు"అడిగాడు గణేశ్ బాబు.

"మాచిన్నాయన కుమార్తెకొడుకు. వాళ్ళది చాల పేదకుటుంబమయినా మంచి బుద్ధిమంతుడు. ఫస్టుమార్కులతో యీ సంవత్సరమే స్కూలుఫైనలు ప్యాస్ అయ్యాడు. మనయింట్లో మనతోబాటు కలసిపోయే సంబంధం - యింతకంటె మనకు కావలసిందేమిటి బాబూ!" అన్నాను.

"భలేపనిచేశావు - తమ పెండ్లిళ్లు దరిద్రాన్ని తొలగిస్తవని నమ్మేపేరాశపరులకు యీనాడు నీవు చేసినపని గుణపాఠమగుతుంది" అన్నాడు రాఘవయ్య.

"కాకపోతే ఎవడబ్బ సంపాదించినముల్లె యుందని వీళ్ళీ కోర్కెలు కోరడం" అని పలవరిస్తుంటే కాంతంవచ్చి"ఏమండోయి! నిద్రలోకూడ మావాళ్ళ నాడిపోసుకోడ మేనా"అంటూ తట్టిలేపింది.

"మీవాళ్లు మంచి వాళ్లైతే గా" అంటూలేచి చొక్కావిప్పి కాళ్లుచేతులు కడుగుకొని భోజనానికి తయారయ్యాను.





## దుంపలతో పోళీ

అరవీశ తెల్లదుంపలు బాగుగా కడిగి వుడకపెట్టాలి. వుడికిన తరువాత పైతోలుతీసి, దుంపల నన్నిటినీ చిదిపి పిండిగాచేసి అందులో కొంచెము ఏలకులపొడి, 5 పలముల చక్కెర వేసి బాగుగాకలిపి నిమ్మకాయలంత వుండలుచేసి తయారుగా వుంచుకోవాలి. తరువాత గోధుమపిండి నీళ్ళుపోసి బాగుగాకలిపి పలుచగాకొద్దిగా పూరీలు వత్తాలి. ఒక్కొక్క పూరీలో పైనచేసివుంచిన, ఒక్కొక్క వుండపెట్టి, పూరీమడిచి, మళ్లా పూరీ మోస్తరే వత్తాలి. అన్నీ ఈ విధముగానే వొత్తి, తయారుగా వుంచాలి. పొయ్యిమీద దోశపెనముపెట్టి బాగా కాలిన తరువాత కొంచెము నెయ్యిరాసి, ఈ వత్తిన పోళీ వేసి చక్కగా కాల్చాలి. చక్కగ కాలిన పోళీమీద ఇంత పేరిన నెయ్యో, వెన్నో వేసుకొని తిన్నామంటే మహారుచిగా వుంటాయి. రుచిగానే కాదు, వంటికి బలముకూడాను.

యం. సుశీల

## కొబ్బరి పచ్చడి

పచ్చికొబ్బరి తురుమును కావలసినంత ఒక కళాయిలో నుంచుకొని అందులో తగుమాత్రంగా ఉప్పు కొద్దిగా చింతపండు పులుసు, కావలసియున్నచో పచ్చిమిరపకాయలు సన్నగాతరిగిన ముక్కలు, పసుపువేసి బాగాకలియునట్లు గరిటతో కలుపవలెను.

బాణట్లో కొద్దిగా నూనెగాని, నెయ్యిగానిపోసి పొయిమీదనుంచి అందుల్లో ఒకటి రెండు ఎండు మిరపకాయల తుంపులను, కొద్దిగా ఆవాలు, జీలకర, మినపప్పు గింజలనువేసి చిటపటమనేదాక దోరగా వేయించుకొని అందులో బాగా కలిపియుంచిన కొబ్బరి తురుమును వేసి కలియబెట్టి దింపేసెయ్యాలి. ఈ పచ్చడి రుచికరమేకాక, సునాయాసంగా బహుకొద్దికాలంలో తయారగు పచ్చడి.

## కొబ్బరి పొడుం

ఎండు కొబ్బరి పొడుం చాల రుచిగా నుంటుంది. కావలసినన్ని ఎండుమిరపకాయలను, ఉప్పు కోట వేసి మెత్తగా నూరుకొని అందులో ఎండుకొబ్బరి ముక్కలను, కావలసియున్నచో చిన్నఉల్లిపాయ రెబ్బలను వేసి మెత్తగాదంచి గిన్నెలోకి తోడుకొనవలెను. దీనిని అన్నంలో నేతితోటి కలుపుకొన్ని తినినచో చాల రుచికరమేకాక అన్నహితమైనదికూడాను.

చివుకుల లక్ష్మీపున్నయ్య

# ఆంధ్ర జానపద గేయవాఙ్మయ చరిత్ర

## కాంభోజరాజుకథ (క్రీ. పూ. అయిదవ శతాబ్దం)

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

### రాక్షసులు

ఈ కథలో రాక్షసపురి అనే పట్టణముంది. అక్కడి రాక్షసులు నరులను భక్షిస్తారు. కాని ఒక విచిత్రకారణంవల్ల రత్నాలగంధి అనే బ్రాహ్మణ స్త్రీని వారు పెంచేరు. ఇట్లే యోజనగంధి అను మరొక స్త్రీ చుట్టుకూడ రాక్షసులున్నారు. ముఖ్యంగా ఐతిహాసికగ్రంథాలైన రామాయణ, భారతాలలోను, పురాణాలలోను రాక్షసులు వస్తారు. వీరు 'ఖశేయులు' అను జాతిలోని రెండు ఉపజాతుల (అనగా యక్షులు, రాక్షసులు)లో ఒకరు * రాక్షసులనువారు కవి యొక్క భావన అని తలచరాదు. వీరు పూర్వకాలంలో ఉండిన ఒక తెగవారు. క్రీస్తు పూర్వం ఏదో శతాబ్దంలోని వీరిస్థితి ఏమనగా-ఆర్యులు నాటి ప్రజలను సమీపించినప్పుడెల్లా ఆనాటి ప్రజలు రాక్షసులు (Savages) అని భావించరాదు. కొందరు ఆ విధంగా ఉండినమాట వాస్తవమే! కాని మరికొందరు ఎంతో సాంఘికాభివృద్ధి ధన ధాన్యసంపదలు, అందచందాలు కలిగుండేవారు. నాడుప్రజలు కొన్నిచోట్ల స్థిరనివాసం ఏర్పరుచుకోగా కొత్తగావచ్చిన వారితో యుద్ధాలు చేసేవారు + నరభక్షకులైన నాయకులు రాక్షసులు. స్థానమందుండు ఋషీశ్వరులను వారు బాధపెడుతూండేవారు × దక్షిణ హిందూదేశంలో విద్యాధరులు, రాక్షసులు అనే రెండు తెగలుండేవి. వీరు అహింసాసిద్ధాంతాన్ని అనుసరించేవారు (?) ♦ నాగజాతివారు నాగరికతకలిగి ఉండగ, రాక్షసులకు నాగరికత తక్కువ.

### దాసులు

రంగసాని అను ఆమె కొత్తగా వచ్చినవారిని తన విద్యలతో గెల్చి, దాసులు (Slaves) గా చేసుకొనేది. దాసుల ప్రతిపత్తి పూర్వకాలంలో ఉండేది. స్వతంత్రులనేగాక దాసులను (Slaves) అనేక జగడాలలో పట్టుకొని సొంత సేవకు ఉపయోగించుకొనేవారు. దాస్యము వారికి వేయబడిన ఒక శిక్ష △ కాబట్టి ఈ కథలోని దాస్యంకూడ దీనిప్రాచీనతను బలపరుస్తూంది.

### కర్ణాటకం

ఈ జంగం కథలో కర్ణాటకం అనుమాట రెండు చోట్లవచ్చింది.

'1 ఉత్తరాది మా భూమందున కర్ణాటక భూమియందున '(పుట 1)

కర్ణాటకానికి ఉత్తరమందుండే ప్రదేశము అని దీని భావం. కాంభోజురాజు పాలించిన ప్రదేశం కర్ణాటకానికి ఉత్తరాన ఉంది. దీని ముఖ్యపట్టణం కాంబపురి. ఉత్తరాన ఉన్న ఈ ప్రదేశానికి తెలంగాణా అని ఇప్పటిపేరు. అప్పుడు ఇదంతా త్రిలింగదేశం.

---

* Ancient Indian Tribes - The Bhutas by P. L. Narasimhaswamy P. 32

\+ The Buddhist India by Rhys Davids p 32

× An advanced History of India by R. C. Mazumdar and others P 93.

♦ తిరుక్కురళ్ అను తమిళ గ్రంథాన్ని ఇంగ్లీషులోకి అనువదించిన ఏ. చక్రవర్తిగారి అభిప్రాయం. The Hindu, weekly Magazine. 31-1-54.

△ The Buddhist India by Rhy Davids P. 40.

2 కర్ణాటకాభరణ భూమిగా (పుట 25) 'కర్ణాటకం' ప్రసిద్ధమైన స్థలం అని మాత్రమే దీని భావం.

ఆంధ్ర భృత్యులైన శాతవాహనులకు మరొక పేరు శతకర్ణిరాజులు. శతకర్ణులు పరిపాలించడం బట్టే కొంతప్రాంతానికి కర్ణాటక దేశమని పేరు వచ్చిందని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. మనుష్యుల పేర్లలో 'కర్ణ' శబ్దమున్న పేర్లలో కుంభకర్ణుడు ఒకటి. ఇతను దక్షిణప్రాంత వాసే.

ఇప్పుడు కర్ణాటమని చెప్పబడేదంతా నల్లరేగడి (Black cotton Soil) ప్రదేశం. కరినాడు అంటే నల్లటి ప్రదేశంకదా! కరినాడు అను పదసంపుటినుండి కర్ణాటశబ్దం వచ్చిఉండవచ్చు. శ్రీశైలంచుట్టుపట్ల ప్రదేశానికి 'కన్నాడు' అను మాట పూర్వశాసనాలలో కనబడుతూంది. కరినాడు అను మాటే కన్నాడు అయుండవచ్చు. 'ఉదా-మరునాడు' అను మాటను 'మన్నాడు.' కర్ణ రాజులు పరిపాలనవల్ల కర్ణాటకమను మరియొకపదంకూడ ఏర్పడిందని చెప్పవచ్చు. దేశమును తెలియజేయు కొన్ని పదాల చివర 'క' అక్షరం ♦ కనబడుతూంది - ఇండిక, మంజీరకా అంధ్రకా మహిషకా. అట్లే కర్ణాటకమని కూడ అయుండవచ్చు. మొదట కరినాడు అనిఉన్న మాటనె పాటకులు తర్వాత కర్ణాటకమని మార్చి ఉంటారు.

కరినాటి శబ్దంవంటిదే 'వెలనాటి' శబ్దమును. సముద్రపు తెల్లటి ఇసుకతో మిశ్రమైన తీర ప్రదేశం వెల్లనాడు-అనగా తెల్లటిప్రదేశం. వెల్ల నాటి మార్పే వెలనాడు.

## రామలింగస్వామి ప్రతిష్ఠ

కాంభోజ రాజు సంతానం కోసం రామలింగ స్వామిని ప్రతిష్ఠచేసేడు. తెలుగు దేశంలో సంతానం కోసం నాగప్రతిష్ఠను, లింగ ప్రతిష్టను చేసే ఆచారాలున్నాయి. లింగప్రతిష్ఠ పురాతన కాలంలోని హైంగిక ప్రతిష్ఠకు సంబంధించినదని చెప్పవచ్చు.

రామలింగస్వామిలోని రామశబ్దంశ్రీరాముని కథకు సంబంధించినది. వాల్మీకికి పూర్వమే శ్రీరాముడి కథ కొన్ని శతాబ్దాలగా హిందూదేశంలోవస్తూంది. ఆ కథను తీసుకొని వాల్మీకి కవి మహత్తరమైన మహాకావ్యాన్ని సృష్టించేడు.

## నరమేధ మొదలైనవి

నర మేధలు, నరబలులు మొదలైన ఘోర కార్యాలు ★ పూర్వకాలంలో ఉండేవి. వీటి సంబంధమైన ఘటన ఈకథలో కనబడుతూంది. కాంభోజరాజు వ్రణానికి మనిషిమేదస్సుతో వైద్యం చేయాలిట! ఇట్టి అభిప్రాయాలకి కారణం నరబలులనే చెప్పవచ్చు. ఆకాలంలో బౌద్ధమతం వ్యాపించడంతో ఇటువంటివి కొంత తగ్గేయి. కాని ఈ కథాకాలానికి బౌద్ధమతానికి అధిక ప్రచారంలేదు.

## అపనమ్మకం?

కాంభోజరాజు భార్యయైన మాణిక్యదేవికి దేవుడిలో నమ్మకంలేదు. దానికి శిక్షగా ఆమెను అడవులలో చెరలోపడేశారు. అంతటిలో ఆమె తేరుకొంది. దైవ సాక్షాత్కారం కోసం వేదనపడింది. ఆమెకోరిన ప్రకారం దేవుడు మగ శిశువును ఇచ్చేడు. ఆశిశువే చెరబందిరాజు.

మాణిక్యదేవి యొక్క అపనమ్మకానికి కారణం అప్పుడప్పుడే వ్యాపిస్తూన్న బౌద్ధమతం.

## వలసలు

పూర్వకాలంలో ప్రజలు వలసపోవడం బహు సామాన్యం. దీనికి రెండుకారణాలు - 1 ఉన్నచోట జనాభావృద్ధికాగా స్థలంచాలక వేరుచోటుకి

♦ చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్రము, పుట 63.

★ విష్ణుకుండిన రాజవంశంలోని ఒక రాజు నరమేధంచేశాడు.

పోవడం, 2 ఇతరజాతులవారు దండెత్తిరాగా కొత్త స్థలాలకి పారిపోవడం.

కాంభోజరాజుకి నరమేధస్సుతో వైద్యం చేయవల సుంటుందని తెలిసి యువతీయువకులు వలసలకు పారిపోయేరు.

## ఆయుర్వేద వైద్యం

ఈ కథలో ఒక అపూర్వ విషయమేమంటే, ఆ కాలంనాటి వైద్యప్రావీణ్యత. ఇది దీనిలో ముఖ్యస్థాన మాక్రమించుకొంది. దానివల్ల కథ కొత్త మార్గం తొక్కింది. హిందూదేశంలో వైద్యవిద్య ఉచ్చదశలో వేదకాలంనుండి కనిష్కుని (క్రీ. శ. 125-153) కాలందాక ఉంది. మౌర్యరాజుల పాలనలో కూడ మంచి స్థితిలోనె ఉండేది. కథలో శస్త్రచికిత్స విషయంలేదు. కనిష్కుని కాలం నాటికి శస్త్రచికిత్స బాగా వృద్ధిపొందింది. కాబట్టి ఈ కథ అంతయు పూర్వపు రచన అనే చెప్పవచ్చు.

## యంత్రాలు

ఈ జంగం కథలో యంత్రాల ప్రసక్తిఉంది. కీలుగుర్రం మొకటుంది. అది ఆకాశంలో సంచరిస్తుందట. కీలుగుర్రం మరలతో తయారుచేయబడిందని చెప్పవచ్చు. అట్లే బిసలుమంచం, బొమ్మల కుర్చీ ఉన్నాయి. ఇవీ మరలవే. యంత్రనిర్మితాలు అని చెప్పదగినవి విమానాలు. విమాన ప్రశంస రామాయణంలోఉంది. ఇవి క్రీస్తు పూర్వపు నిర్మాణాలు. ఇవి వట్టి కవి కల్పనకాదు. యంత్రాలను గురించి భరద్వాజుడు రచించిన గ్రంథమొకటుంది. ♦

## మతం

ఈ కథలో వివరింపబడ్డ మతమేమంటే - అప్పటివారు త్రిమూర్తులను - బ్రహ్మ విష్ణు మహేశ్వరులను కొల్చేవారు. అయినా శివుడు ప్రధానం. కథాకాలానికి ఇంకా విష్ణువుయొక్క అవతారాల సిద్ధాంతం పైకిరాలేదు కాబోలు! వాల్మీకి కాలానికిగాని శ్రీరాముడు విష్ణవతారంకాలేదు. కథాకాలంలో బ్రహ్మకికూడ గుడికట్టబడింది.

## ప్రక్షిప్తాలు

అసలు మూలగేయంలో లేకుండ, ఇటీవల చేర్చబడ్డాయి అని చెప్పదగినవి దీనిలో చాల ఉన్నాయి. అటువంటివి వెతికినకొద్దీ దొరకుతాయి. ఈ కథాకాలంలో బ్రాహ్మలు, క్షత్రియులు, కోమట్లేగాక వెలమలు, పంటవారు, కమ్మవారుకూడ ఉన్నారట. ఈ చివరి కులాలు ఇటీవల ప్రసిద్ధికిరాగా వాటిని పాటకులు ఈ పాటలో చేర్చేరు. 'కర్ణాటక' శబ్దం గురించి ఇదివరకే తెలియజేసెను. ఈ కథలోని కొన్ని పేళ్లుకూడ ఇటీవల మార్చబడినవనే చెప్పవచ్చు. ఉదా:- మంత్రి బ్రహ్మయ్య. పల్నాటి యుద్ధకాలంలోని ప్రసిద్ధ పురుషుడు మంత్రి బ్రహ్మయ్య. ఈ పేరే పైకథలోని పేరు బదులు చేరిందని చెప్పవచ్చు. నాగజాతికి చెందిన నాగేంద్రుడు ఆఖరికి తొమ్మిది మూరల పొడుగు, ఆరు మూరల వెడల్పు పాముగా తయారయ్యేడు.

ఇట్లే ఇతరాలు కొన్ని ఉన్నాయి.

## భాష, పదాలు

ఈ పాటలోని భాష అంత ప్రాచీనంగా కనబడుతూండా అని ఒక ప్రశ్న. ఇది నోటిపాట కాబట్టి మార్పులు పొందుతుంది. అయినా వచనంలోను, పద్యంలోను కొంత గ్రాంథిక స్వరూపముంది. అలిఖిత వాఙ్మయానికి ఈమార్పులు తప్పవు.

జానపద రచనలలో పదునాలుగో శతాబ్ది మధ్యభాగానికే హిందుస్థానీ మాటలు తెలుగు రచనలోకి

---

♦ మహర్షి భరద్వాజుడు రచించిన యంత్రసర్వస్వంలోని విమాన శాస్త్రమును ప్రియరత్న ఆర్షగారు హిందీలోకి అనువదించేరు. దానిని తెలుగులోకి పుత్తేటి సుబ్రహ్మణ్యాచార్యులుగారు చేయగా జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులుగారు ప్రకటించేరు. దీని విలాసం - అరుణోదయ పత్రికా సంపాదకులు, దువ్వూరు, కడపజిల్లా.

ఎక్కాయి. ఈ కథ బాగా ఇటీవలి రచనే అయితే హిందుస్థానీ పదాలు చేరిఉండేవి. దీనిలో కనబడుతూన్న 'పాడుమసీదు' (పుట 18) అన్నమాట పాడుగుడికి వచ్చిన పొరపాటు మాటే. దీనిలో పాడుగుడి ప్రశంస అక్కడక్కడుంది. అట్లే కాగితం, కలంపుల్ల (పుట 23) వంటివి పాటగాళ్ళు చేర్చినవి మాత్రమే. ఇట్టిమార్పు కొన్నింటిలో స్పష్టంగా కనబడుతూంది. ఆదిని 'చెర' అని ఉన్నమాట 'చెరబందిఖానా' (14), 'పన్నెండు'కి బారాపన్నెండు (25) అయేయి. ఇవి పేపరు కాగితం, గేటుగుమ్మంలాంటి పదాలు.

## రామాయణ భారతకథల ప్రభావముందా?

క్రీస్తు పూర్వం ఏడో శతాబ్దనాటికే రామాయణ కథ ప్రచారంలో ఉన్నట్లు బౌద్ధ వాఙ్మయంనుంచి తెలుస్తూంది. కాని ఆ నాటి రామాయణం చంపూ రచనే కాని ఇప్పటి సంపూర్ణ శ్లోక రూప గ్రంథం (వాల్మీకి రామాయణం) కాదు. భారతకథయొక్క ఉనికి పూర్వ బౌద్ధ వాఙ్మయంనుంచి తెలియడం లేదు. * కాని హిందూ పురాణాలనుంచి తెలుస్తూంది. ‡

కాంభోజరాజుకథలో పైరెండుకథల ఛాయ లెక్కడేనా ఉన్నాయా అంటే బలమైనవి కనబడవు.

చెరబందిరాజు చేసుకొన్న వివాహపద్ధతి వేరుగా ఉంది. యోజనగంధి ఆరునెలలు నిద్రపోతుంది. ఇది రామాయణంలోని కుంభకర్ణుని అనుసరణ అని చెప్పవచ్చు. శ్రీరామునికథ దక్షిణ హిందూదేశంలో కూడ చెప్పుకొంటూండేవారని చెప్పవచ్చు; కాని దాని రూపం మనకు తెలియదు.

కాంభోజరాజుకి ఏడుగురు కొడుకులు. (ఇది పూర్వపు తెలుగుకథల లక్షణం.) వారికి శతవృద్ధి రాజులని పేరు. ఈ శత (నూరు) శబ్దం ఆర్యుల కథలలోని సంప్రదాయం. ఆంధ్ర భృత్యులు శతకర్ణులు కదా. కౌరవులు నూరుగురు. సగరుడికి నూరుగురు సంతానం. నిషమహారాజుకి నూరుగురు సంతానం. సోమకమహారాజుకి నూరుగురు భార్యలు, నూరుగురు సంతానం. § విశ్వామిత్రుడికి ఏభైమంది పుత్రులే. ఇట్లు ఇదిఒక సంప్రదాయాన్ని తెలిపే సంఖ్య కావచ్చు. కాని ఇది యదార్థ విషయమే అని ఈ కింది అంశాలనుచూస్తే తడుతుంది. ఇప్పటి సయాందేశపురాజుకి తొంభైమంది పుత్రులు. అతని తండ్రికికూడ తొంభైమంది సంతానమే! † ఇట్లు ఈ కథలో తెలుగు సంప్రదాయంలోని 'ఏడు' ఆర్యుల సంప్రదాయంలోని శతం (నూరు) విచిత్రంగా ముడిపెట్టబడ్డాయి.

కాంభోజరాజుకథలో రామలింగస్వామి అను దేవుడి పేరుంది. దానిలో 'రామ' శబ్దం శ్రీరాముడికి సంబంధించినదే! రామ శబ్దం ప్రాచీనబౌద్ధ గ్రంథాలలోకూడఉంది. 'గౌతముని గురువయిన రాముడు ఉద్దాకుని కుమారుడు, శిష్యుడు కూడాను + ' కాంభోజరాజుకథలో చెరబందిరాజు అమ్మే మందులలో రామలక్ష్మణుల మందొకటుంది. కాని ఈ పోలికలన్నీ లెక్కపెట్టదగినవి కావు.

## సముద్రయానం

ఈ కథాకాలంలో సముద్రయానం ఉన్నత స్థితిలోఉంది. చెరబందిరాజు సప్త సముద్రాలను దాటి నిర్మల మందును తెచ్చేడు. మన శాస్త్రా

* The Buddhist India by Rhy Davids.
‡ History of the Panchala by Paravasthu L. Narasimha Swamy The Arsha company Vizagpatam 1925 P. 22.
§ „ „ P. 25.
† The Ancient Indian Tribes-the Bhutas by Paravasthu L. Narasimha Swamy P. 4.
+ The Buddhist India by Rhys Davids P. 11.

లలో సముద్రయానాన్ని నిషేధించడానికి ముందే ఈ కథ పుట్టింది.

### ఊళ్ల పేళ్లు

కాంభోజరాజు ముఖ్యపట్టణం సాంబపురి. కర్ణాటక దేశానికి ఇంకా దక్షిణంగా ఉన్న పట్టణం రాక్షసిపురి. నేత్రవాది అను పేరుగల పురిఉంది. ఈ రకంపేళ్లు కొన్ని చరిత్రలో కనబడుతున్నాయి. నతవాడి, మార్జవాడి, గంగవాడి ఇత్యాదులు.

### మనుష్యులపేళ్ళు మొదలైనవి

దీనిలోని కొన్నిపేళ్లు చిత్రంగా ఉన్నాయి. కుమ్మరిరాజు కుమార్తెపేరు యోజనగంధి. మరి కొన్నిపేళ్లు - కుసుమగంధి, రత్నాలగంధి, సూర్యకన్యక, చంద్రకన్యక, పగడకన్యక. మంత్రిపేరు బ్రహ్మయ్యట! త్రిమూర్తులు, వారి భార్యలు, వీరభద్రస్వామి, రామలింగస్వామి దీనిలోని కొందరు దేవతలు.

### కథ మోస్తరు

కాంభోజరాజుకథలో దేవుళ్లు వేషంభేదంలేకుండా మామూలు మనుష్యులలాగు వస్తూపోతూంటారు. ఈ అంశంచూస్తే ఇదొక గంధర్వకథ (Fairy Tale) లాగు కనబడుతుంది. ఈ మోస్తరుగా కనబడడానికి తగిన కారణాలు లేకపోలేదు. పురాణకథలలో ఇటువంటివి వేనవేలు!

ఈ కథలో ఆ నాటి మనుష్యుల జీవితం, ఆలోచనలు, నమ్మకాలు మొదలైనవి కనబడతాయి. ఆ నాటి కథాసంప్రదాయాలు, ఆ నాటి చరిత్ర మనకు పూర్తిగా తెలియకపోవడంచేత అంతా వట్టి కల్పనలాగు కనబడుతుంది. ఇన్నిటికీతోడు ఒక సంగతిఉంది. కొన్ని అంశాలనుచూస్తే ప్రాచీన రచయితలు వాస్తవికా 'జగత్తుకి, కల్పనాజగత్తుకి భేదం అంతగా గమనించేవారు కాదేమో అనిపిస్తుంది. రామాయణంలోని ఈ కింది అంశం చూడండి - రావణుడికి పదితలకాయలుట! రావణుడిదారుణ శీలాన్ని తెలియజేయడానికి కవి అట్టి కల్పన చేసేడేమో! రాక్షసులు అందవికారులు అని చెప్పడానికి కవి వాళ్లకి ఒకే కన్ను, ఒక చెవే ఉన్నాయని చెప్పడానికి వెనుకతీయడు. పాతకథలలో ఇట్టి అసందర్భాలు కనబడకమానవు. కాని కాంభోజరాజుకథలో మనం ఊహించే దానికంటె ఎక్కువ వాస్తవికత, యదార్థత ఉన్నాయి.

(సశేషము)

# జన్మభూమి - స్వామిభక్తి

శ్రీ డేగా రాధాకృష్ణయ్య

అది గోదావరీ నదీతీరముననొక చిట్టడవి. అందులో ననేకరకముల ఫలవృక్షములు, వాని నాశ్రయించుకొని పక్షులనేకముండేవి. ఒక గుబురుగానున్న అశ్వద్ధవృక్షముమీద గూడు నిర్మించుకొని లకుముఖి, శుచిముఖి అనే రెండు పక్షులు నివసిస్తుండేవి.

ఆ వృక్షము మార్గమధ్యముననుండుట చేత వచ్చేపోయే వారు మార్గాయాసపు బడలిక తీర్చుకోడానికి దాని నీడన విశ్రమించేవారు.

ఒకనాడు ఒక యజమాని, నౌఖరు ఆ చెట్టునీడన విశ్రాంతి తీసికుంటున్నారు. యజమాని నౌఖరు నొకకథ చెప్పమని అడిగాడు.

"మానవ జీవితమే ఒకకథ. నా స్వంత జీవితమునే కథగా చెప్తాను వినండి" అని ప్రారంభించాడు.

"నేను ఒకప్పుడు జమీందారు దగ్గర నౌకరిలో ప్రవేశించిన కొద్దికాలంలో నేఅతని జమీన్ పరుల హస్తగతమయిపోయింది. నేను అచ్చట మానేసి నొకమంత్రి పుంగవుని నౌకరికి ఆశ్రయించాను. అచ్చట సయితం నేను పోయి చేరిన కొన్ని రోజులకే మంత్రి పదభ్రష్టుడై పోయాడు. తర్వాత అక్కడ మానేసి నొకషావుకారు యొద్ద నౌకరికి కుదిరిన బహుస్వల్పకాలంలోనే సరకులధరలు తారుమారై దివాలా తీశాడు. తర్వాత అక్కడినుండి వచ్చి మిమ్ముల నాశ్రయించాను." అని కథ ముగించాడు.

దానిని విని యజమాని "అయితే నీవి అంత చలవపాదాలన్నమాట!" అన్నాడు.

దీనిని వింటున్న లకుముఖి, శుచిముఖి పక్షులజంట వీరికి గుణపాఠం ఎలాగ నేర్ప డమా అని ఆలోచింపసాగాయి.

ఇంతలో నాయడవిలో నొకమూలనుండి కారు చిచ్చు వ్యాపించ మొదలుపెట్టింది. ఆ భయంకర దృశ్యాన్ని చూచి ఆ చెట్టు నీడనున్న వారనేకులు పలాయన మంత్రము పఠించారు. యజమాని, నౌఖరు తలపై కెత్తి చూచి చలించకుండా యున్న పక్షుల జంటను చూచి కారు చిచ్చుకాహుతి యగునను ఆదుర్దాతో తరిమి వెయ్యాలని కేకలు వేయడం మొదలు పెట్టారు. ఆ జంట పక్షులు మాత్రం కదలలేదు.

"అగ్నిజ్వాలలు భయంకరంగా ఆవ రిస్తున్నా యీ పక్షులు భయపడకుండా

అలాగే యున్నవేమా" అని ఆశ్చర్య చకితులయ్యారు.

అప్పుడా జంట పక్షులలో నొకటి మనుష్యభాషలో "మీరు మూర్ఖులు, విశ్వాసమూలినవారు కాబట్టి కష్టానికి వెరచి సుఖానికి ప్రాకులాడుతూ, మాకు నీడనిచ్చి, కాయగసురులను, ఫలములనిచ్చి పోషిస్తున్న యీ వృక్షాలు ఆపదలో నుండగా యీ యడవినివదలి పొమ్మనంటు న్నారు. మేమంత విశ్వాసఘాతకులము కాము. కష్టమో సుఖమో యీ ప్రాంతము మా జన్మభూమి కాబట్టి యితరులతో బాటుయుండి అనుభవిస్తాము. ఈ వృక్షము మాకు తల్లివంటిది. జన్మభూమి స్వర్గధామ మని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి - మీకు తెలియదా!" అన్నది.

ఆ మాటలు ఆశ్చర్యము కలిగించింది. అతివడిగా ఆకాశాన్నంతా కారుమేఘము లాక్రమించి కుంభవృష్టి కురిసింది. అగ్ని చల్లారింది. మాతృభూమిని గౌరవించడం, స్వామిభక్తి పరాయణులుగ నుండటం ప్రతిమానవునియొక్క ధర్మం కదాయను కుంటూ యజమాని, సౌఖరు యిండ్లకు చేరారు.



ఎ. వి. యం. వారి 'సంఘంలో' అంజలీదేవి.



# బాలక్రీడా పాఠశాలలు

వి. ఎన్. కొణనోవ్‌స్కీ

పాఠశాల కార్యక్రమంలో భాగంగానూ, చదువు కాక యితర కార్యకలాపాలుగానూ వివిధ వ్యాయామ శిక్షణా పద్ధతులను సోవియట్ పాఠశాలలు అనుసరిస్తాయి. ఇంతేకాకుండా, పాఠశాలకు వెలుపల బాలబాలికలకు క్రీడా కేంద్రాలున్నాయి; అంటే బాలసంఘ మందిరాలలోనూ, క్రీడాసంఘాలలోనూ ఫాక్టరీక్లబ్బులలోనూ తదితరచోట్లా యిటువంటి కేంద్రాలుంటాయి. వీటిలో ప్రత్యేక బాల క్రీడా పాఠశాలకు ఒక ముఖ్యస్థానముంది.

క్రీడలపట్ల ప్రత్యేక ఆసక్తి చూపించే 13 నుండి 18 సంవత్సరాల వయస్సుగల బాలబాలికల కోసం యీ క్రీడా పాఠశాలలు నెలకొల్పబడ్డాయి. ఆరోగ్యవంతమైన, శారీరకంగా అభివృద్ధిచెందిన, గట్టి యువతీ యువకులను తర్ఫీదు చెయ్యడం వీటి ప్రధాన లక్ష్యం. అవి నగరాలలోనూ, పెద్దనగరాలలోని పేటలలోనూ, నగర పేటల విద్యాశాఖల అధ్వర్యాన నెలకొల్పబడ్డాయి. ఉదాహరణకు మాస్కోలో యిటువంటి పాఠశాలలు 26, రష్యన్ ఫెడరేషన్‌లో మొత్తం 300 వున్నాయి.

మాస్కోలోని స్టాలిన్ పేటకుచెందిన బాలక్రీడా పాఠశాల యీరకం సంస్థకు చక్కటి ఉదాహరణ. 1939 నుండీ అది పనిచేస్తున్న 15 సంవత్సరాలలోనూ ఆ పేటలోని సాధారణ విద్యాపాఠశాలలో దాని కృషికి ప్రసిద్ధి పొందినది; పిల్లలకు అదంటే ఎంతో యిష్టం. దానిలో సభ్యుడుగా వుండడం గౌరవంగా భావిస్తారు. క్రీడలంటే ఆసక్తివున్న, పైన చెప్పిన వయస్సుగల స్కూలు పిల్లలందరూ, ప్రవేశిక పరీక్ష ప్యాసయితే సభ్యత్వానికి అర్హులు; ఈ పరీక్ష దరఖాస్తు దారునికి ఆసక్తిగల క్రీడను బట్టి భేదంగా వుంటుంది.

ఈ పాఠశాలలో, స్కీయింగ్, స్పీడ్‌స్కేటింగ్, బేస్కెట్‌బాల్, వ్యాయామ క్రీడలు అనే నాలుగు శాఖలున్నాయి. ప్రతిశాఖ, శిక్షణపొందే సుమారు 15-20 మంది పిల్లల జట్లుక్రింద విభజింపబడింది; యీ జట్లు పాఠశాల మూసేక వారానికి మూడుసార్లు కలుసుకుంటాయి. స్కూలు ప్రిన్స్‌పల్ ఓ. డి. ఉషన్ వ్యాయామ శిక్షకురాలుకూడాను. వివిధ క్రీడాశాఖలకు అనుభవజ్ఞులైన బోధకులున్నారు. వారంతా స్కూలు యొక్క ఆచార్యగణం; శిక్షణకు, క్రీడల టెక్నిక్‌కు సంబంధించిన విషయాలన్ని వారు నిర్ణయిస్తారు.

శాఖలో అనుసరింపబడే శిక్షణాపద్ధతి, శారీరక సర్వతోముఖాభివృద్ధి అనే సోవియట్ వ్యాయామ శిక్షణ వ్యవస్థ ప్రధానసూత్రం మీద ఆధారపడి వుంటుంది. దీనిననుసరించి, బాలక్రీడాకారి తన అభిమాన క్రీడను మాత్రమే పట్టుకుకూర్చోక, యితర రకాల క్రీడలనుకూడా నేర్చుకుంటాడు. ఇటీవలిసంవత్సరాలలో అన్ని శాఖలు, వేసవిసెలవుల్లో తప్ప ఏడాది పొడవునా శిక్షణ యివ్వడం మొదలెట్టేయి. ఉదాహరణకు, స్కీయర్లు వసంతకాలంలోనూ, వేసవిలోనూ పడవనడపడం, ఈత, ఫీల్డ్ అండ్ ట్రాక్ క్రీడలను చేపడతారు. స్పీడ్‌స్కేటర్లు సైకిలింగ్ చేబడతారు. ఏడాది పొడవునా శిక్షణ, స్కూలు క్రీడాకారులు తమ క్రీడావిజయాలను పెంపొందించుకోడానికి బాగా తోడ్పడింది.

శిక్షణపొందే విద్యార్థులకు వ్యాయామక్రీడలంటే చాలా యిష్టం. ఈ శాఖలో చేరిన వారి సంఖ్య 150 వరకూ వచ్చింది. 1954లో యీ పాఠశాలకు యీ క్రీడలో ద్వితీయస్థానం వచ్చింది. ఈ పోటీలో తమ వయసుకు చెందిన జట్లలో అగ్రస్థానం గెలుచుకున్న 13-14 ఏళ్ల వయస్సుగల అందరికంటె చిన్న

వారైన క్రీడాకారులు యీ పాఠశాలకు గర్వ కారణం. వ్యాయామక్రీడలలో నలుగురు మాస్కో జూనియర్ ఛాంపియన్లు - మాక్సిమోవ్, సఖరోవా, ప్లటనోవ్, ఇవనోవ్ - యీ పాఠశాలకు చెందిన వారే.

స్కీయర్లుకూడా ఘనవిజయాలు సాధించేరు. ఈ పాఠశాలలు 1950 మాస్కో ఛాంపియన్ షిప్ పోటీలో నాల్గవస్థానం పొంది, వారు క్రమంగా అభివృద్ధిచెంది, 1954 ఛాంపియన్ షిప్ పోటీలలో అగ్రస్థానాలను గెలుచుకున్నారు (1951లో 3వ స్థానం, 1952 లో 2 వస్థానం.)

బేస్కెట్ బాల్ క్రీడలోకూడా యీ పాఠశాలకు మాస్కోలో తృతీయ స్థానముంది. పనిచేస్తూ ద్వితీయ సంవత్సరమే అయినప్పటికీ స్పీడ్ స్కేటింగ్ శాఖ, 1954లో మాస్కోలో అయిదవస్థానం గెలుచుకుని బాగా అభివృద్ధిపొందుతూంది. ఈ పాఠశాలలో శిక్షణపొందినవారిలో చాలమంది ప్రముఖ క్రీడా వేత్తలైయారు. ఈ పాఠశాల తన పూర్వ విద్యార్థి విచికనోవ్‌ను చూసి గర్విస్తుంది; ఈయన,1954 అంతర్జాతీయ పోటీలలో పాల్గొనే ఎరిపికైన సోవియట్ జట్లను తయారుచేసిన క్రీడాప్రవీణుడు. ఇంకొక పూర్వవిద్యార్థిని, గాల్కోష్కియానా స్టాలిన్ కేంద్ర వ్యాయామ విద్యాలయంలో పట్టంపుచ్చుకుని యిప్పుడు మాస్కో యూనివర్సిటీలో బోధకురాలుగావుంది. వి. బెల్కయేవ్ అనేకసార్లు మాస్కో స్కీ ఛాంపియన్ అయాడు. ఎంగరుసెవ్ స్పార్టక్ క్రీడా సంఘంలో ప్రముఖ స్కీయర్ గా వున్నాడు.

సాధారణ విద్యాపాఠశాలల్లోని వ్యాయామ బోధకులకు యీ పాఠశాల తోడ్పడుతుంది. గడచిన మూడేళ్లలోనూ అది 250 మంది స్వచ్ఛంద బోధకులనూ, రిఫరీలనూ (వివిధక్రీడలలో) తర్ఫీదుచేసింది. ఈ బాలబాలికలు క్రీడాకేంద్రాలను నడిపించడంలో ఉపాధ్యాయులకు తోడ్పడతారు; పాఠశాల పోటీలలో రిఫరీలుగా పనిచేస్తారు.

క్రీడాపాఠశాల తమ విద్యార్థుల సాధారణవిద్యాభ్యాసంపట్ల చాలశ్రద్ధ వహిస్తుంది. వారి క్రీడాభిరుచి పాఠశాలలో వారి విద్యాస్థాయిని పెంచడానికి సాధనంగా ఉపయోగింపబడుతుంది. పిల్లలుబాగా చదువుకునేటట్టు శ్రద్ధతీసుకోబడుతుంది. బాగా మార్కులు వచ్చినవారు మాత్రమే వివిధ పోటీలలో పాల్గొనడానికి అర్హులు.

బాల క్రీడాకారులు స్వంతంగా గోడవార్తా పత్రిక నడుపుతారు. క్రీడల ఆల్బమ్‌లు తయారుచేస్తారు. ప్రతిశాఖ ఏడుగురు విద్యార్థులతో కూడిన సంఘాన్ని ఎన్నుకుంటుంది. ఇది క్రీడల పోటీలకు అందరూ సమిష్టిగా వెళ్లడాన్ని, క్రీడాప్రవీణులతో సమావేశాలు, క్రీడాఫిల్ములను ప్రదర్శించడం ఏర్పాటు చేస్తుంది. సంవత్సరాంతంలో క్రీడావిద్యార్థుల సాధారణ సమావేశంజరుగుతుంది. యిందులో, సీనియర్ బోధకుడు ఏడాది పనిగురించి నివేదిక చదువుతాడు. వివిధ శాఖల సంఘాలు తమ కార్యకలాపాలగూర్చి రిపోర్టు యిస్తాయి. రాబోవు ఏడాదికి ప్రణాళికలు చర్చింపబడతాయి.

స్కూలు పిల్లలకు తమ క్రీడాపాఠశాల అంటే చాలా యిష్టం; అక్కడవారు స్నేహభావంతో, సోదరభావంతో తర్ఫీదై పెరిగి పెద్దవారవుతారు.

పిల్లలను సుఖవంతంగా, చురుకుగా, ఆరోగ్యవంతంగా పెంచి పెద్దవాళ్లను చెయ్యడంపట్ల సోవియట్ దేశంలో చూడబడే గొప్ప శ్రద్ధా సక్తులకు యిటువంటి పాఠశాలలను నెలకొల్పడం ఒక ప్రబల నిదర్శనం.

'టాస్'






# గయ్యాళి గంప

మా ఊళ్లో ఒకాయనకు గయ్యాళి భార్య ఉంది. పాపం ఆయన ఆమెతో వేగలేక చచ్చిపోతున్నాడు. భార్యనేమీ పల్లెత్తు మాట అనలేడు. అంటే యింకేముంది! మీదపడి పీకేస్తుంది పెళ్లాము. ఆవిడ కాపరానికొచ్చింది మొదలు లోక విరుద్ధంగా అత్తగార్నే సాధించడం మొదలెట్టింది. తన తల్లినికూడ తనదగ్గరే ఉంచుకుంది. పెత్తనం అంతా ఆమెదే. తల్లికి మంచిమంచి బట్టలు కొనేది. అత్తకెప్పుడూ పాత గుడ్డలే యిచ్చేది.

ఆవిడ కిద్దరాడపిల్లలు. ఒకపిల్లకు తల్లి పేరు; మరొకపిల్లకు అత్తగారి పేరు (భర్త ప్రాధేయపడగా కనికరించి పెట్టింది.) ఆ పేర్లకు తగ్గట్టే వాళ్లమీద ప్రేమకూడ ఉండామెకు. తల్లి పేరుపెట్టిన పిల్లంటే ఎంత ప్రేమో అత్తగారి పేరుపెట్టిన పిల్లంటే అంత అసహ్యం ఆవిడకి. ఒకసారి మా అమ్మావాళ్లు వాళ్లింటికి చూడ్డానికెళితే యిలా అందిట తనపిల్లల్ని చూపిస్తూ: 'పట్టుచీరకట్టుకున్న ఆతల్లే మా తల్లి! ఈరికలు కట్టుకున్న ఆ యానాదిముండే మా అత్త!' అని. అదివిని మావాళ్లు నోరు నొక్కుకుని యివతలకు చక్కావచ్చారట!

ఇంక ఆవిడ ఒట్లు పెట్టిందంటే అన్ని విధాలా ఎదటి వాళ్ల కేతగిలేలా పెడుతుంది. ఆవిడ మొగుడెప్పుడేనా ఆవిడగురించి ఏదేనా అనుమానమొచ్చి ఆమెను . నెమ్మదిగా అడిగాడంటే 'మీ అనుమానమే నిజమయితే ఆపాపం నేనే అనుభవిస్తాను. ఆర్నెల్లల్లో నా పసుపు, కుంకుమలు పోతాయి. మీ అనుమానమే కనుక అబద్ధమైతే ఆర్నెల్లల్లో మీరే చచ్చిపోతారు!' అని ఒట్లుపెడుతుంది. (ఎలాగయినా మొగుడే పోతాడన్నమాట!)

ఇలాంటివాళ్లుకూడ యున్నారంటే మీకు ఆశ్చర్యంగానున్నది కదూ!

సి. హెచ్. శ్రీరామమూర్తి

# సూక్ష్మబుద్ధి

ఒకసారి ఏదోపనిమీద ఆచార్యులుగారు, శెట్టిగారు, శెట్టిగారికి సహాయంగా మాల వెంకన్న పొరుగూరు బయలుదేరారు. ఆరోజుల్లో ఎంతదూరమైనా నడిచిపోవాల్సిందే గామరి !

అది మండువేసంగి. ఎండ తీక్ష్ణణంగావుంది. ఆచార్యులుగారికి త్రోవలో దాహంవేసింది. చుట్టుపక్క లెక్కడా బావికాని, చెరువుకాని కనిపించలేదు. ఆయన కళ్లు హఠాత్తుగా తాటిచెట్లుల్లా పొడుగ్గలేచిన చెరుకుతోటమీదపడ్డాయి.

"శెట్టిగారూ ! అదో చూశారా, ఆ చెరుకుతోట ! ఆ కాపు నడిగి - ఓ కాని దబ్బిస్తే వాడే యిస్తాడులెండి ! దాహం తీరుతుంది" అన్నాడు ఆచార్యులు.

శెట్టిగారు చెరుకుతోటవైపు దృష్టి పోనిచ్చి చూశాడు. 'మాబావుంది !' అంటూ రొట్టలు వేస్తూ, "బాగుంది మీ తెలివి ! - అక్కడ ఎవడూ లేడు, ఓ కాని డబ్బు దండగ ! - వెంకన్నా ! నీవుపోయి ఓ రెండుగడలు విరుచుకురా !" అని ఆజ్ఞాపించాడు. పిసినిగొట్టుకాకపోతే, కాని డబ్బుకు కాసిస్తాడా !

పిలకను ముడివేస్తూ "వాడొకవేళవుండీ, చూసీ, తంతాడేమో !" అన్నారు పంతులుగారు.

శెట్టిగారి నీమాటలు భయపెట్టాయి. కాని డబ్బు కానీ అనగానే లేనిధైర్యం వచ్చింది. "ఏడిశాడు ! మనం ముగ్గురం ! వాడొక్కడు !!" అన్నాడు ధీమాగా.

అక్కణ్ణేవున్న రైతు యీ మాటలన్నీ విన్నాడు. శెట్టి 'ఏడిశాడు' అనగానే లేవబోయాడు. కాని "మనం ముగ్గురం" అనే మాటలు లేవనిచ్చాయి కాదు. రైతు కేకవేద్దామా అంటే, వాళ్లొచ్చేలోపల పారిపోతే ! - దూరం ఆలోచించాడు. వాడికో వుపాయం తట్టింది.

కాపులేచి ఏమీ ఎరుగనట్లు వాళ్లదగ్గరికివెళ్లి "దండాలు ! దండాలు !!" అన్నాడు - "ఏం బాబుగారూ, మీరడిగితే కోసియిచ్చేవాణ్ని ! ఆ మాలవెధవచేత కోయించారేందిబాబూ ! వాణ్ని మీరసలు తాకవచ్చా ! - వెధవని ఎందుకు తీసుకొచ్చారూ " అన్నాడు కాపు.

కాపు అన్న యీ మాటలకి వాళ్ళు ఉబ్బిపోయ్యారు. "వాడినెవడు రమ్మన్నారు ! వాడే వచ్చాడు !" అన్నారిద్దరూ ఏకకంఠంతో !

కాపులేచి మాల వెంకన్న కండువాపట్టుకొని రెండు చెంప దెబ్బలిచ్చాడు.

"అరే ! వెధవా ! ఆచార్యులుగారు చెరుకు తిన్నారంటే, మా పెళ్లిళ్లూ, శుభకార్యాలూ చేయిస్తారు కాబట్టి వారి ఋణమే తీర్చుకోలేము ! ఇకపోతే మా సెట్టిగారున్నారంటే ఆయన మాకప్పిస్తాడు. ఆయన ఋణం తీర్చుకోలేను ! నువ్వేం చేశావురా " అంటూ మరిరెండు వాయించి ఓ చెట్టుకు కట్టేశాడు.

ఆచార్యులూ, శెట్టీ పకపక నవ్వేరు. - కాపు శెట్టిని ముందుకులాగి "అరే! బొజ్జయ్యా! అప్పివ్వటానికి చంపి, ఇచ్చిన తర్వాత వడ్డీ పుచ్చుకొనికూడా మమ్మల్ని నానాబాధా పెడ్తావుకదా నిన్నెందుకు కనికరించాలి" అంటూ నాలుగుతన్ని ఓ రూపాయి పుచ్చుకున్నాడు. శెట్టి "కుయ్యో, మొర్రో" అంటూంటే ఆనందించాడు ఆచార్యులు.

"ఇదో ఆచార్యులుగారూ ! మీరు వుత్త కృతఘ్నులు ! ఆ శెట్టిగారు మీకు చేసిన సహాయంమరిచి, వారిని నేను తంతూవుంటే పకపక నవ్వుతారా ! - దక్షిణ డబ్బులు అడిగినంతా ఇచ్చేవరకూ మంత్రాలు చదవరుకదా" అంటూ నాలుగు వీశ గుద్దులిచ్చేసరికి "రూపాయి యిస్తా వదలరాబాబూ !" అంటూ బ్రతిమలాడేరు ఆచార్యులుగారు.

కాపు రెండు రూపాయిలూ మూటలోకట్టూ "శెట్టిగారూ! ఒక్క కానీకి ఆశపడితే 128 కానీలు వదిలాయి!" అంటూ వెటకారంగా నవ్వేడు.

ముగ్గురూ అక్కడవుంటే యింకేమి వస్తుందోనని వాళ్లకి బుద్ధి చెప్పారు.

"చూశారా బాలలూ! కాపు యుక్తి. ముగ్గురూ కలిసి తన్నారంటే ఎందుకూ పనికిరాడు. కాని తన బుద్ధి సూక్ష్మతవల్ల ముగ్గురిని తన్నేడు! యుక్తిని మించిన శక్తి లేదన్నారు పెద్దలు యిందుకే!"

పిళ్లా సుబ్బారావు శాస్త్రి

# తొందరపాటు తగదు

ఒకప్పుడు ఈశ్వరుడు రామనామస్మరణ చేస్తున్నాడట. అప్పుడు పార్వతి శంకరునితో "బలేబాగుంది! భార్యను రావణుడపహరించుకొని పోగా అడవులపాలై తిరుగుతున్న రాముని స్మరించడం రక్తికనా, లేక ముక్తికనా" అని హేళనగా మాట్లాడింది.

అప్పుడు శంకరుడు "పొరబడుతున్నావు పార్వతీ! శ్రీరాముడు విష్ణుస్వరూపుడు; పురాణపురుషుడు, అతని నామ స్మరణ రక్త ముక్తిదాయకం" అన్నాడు.

"రాముడు అవతారమూర్తి అయితే భార్యను పోగొట్టుకొని అడవుల వెంటబడి విలపించడమెందుకు? రావణుని అధీనమున నున్న సీతను తెచ్చుకోలేకనా!" అన్నది పార్వతి.

"భగవంతుడు నరావతారమెత్తి తృటిలో తనకుగల సర్వశక్తులతో వ్యవహరించినచో అవతార ఉద్దేశము లెలానెరవేరతవి?"

"ఇది నేను నమ్మను. నేను స్వయంగా రాముని భగవంతుడుగా గుర్తించడానికి ఒక పరీక్ష తలపెట్టాను. పరీక్ష నెగ్గిననే కాని రాముడు అవతారమూర్తికానేరడు"

"సరే - నీయిష్టం!" అన్నాడు శంకరుడు.

శ్రీరామచంద్రుడు అడవులలో తిరుగుతున్నాడు. పార్వతి సీతరూపంలో అతని చంతకు వెళ్లింది. రాముడు నిదానంగా నామెనుచూస్తూ "ఆ! పార్వతి తల్లియా! -ఏంతల్లీ! యిలాగవచ్చావు - తండ్రికులా సాగానున్నాడు కదా!" అని ప్రశ్నించాడు.

అప్పుడు పార్వతి "శ్రీరామా! క్షమించు. శంకరుడు నీవు నారాయణావతారమని చెప్పినా వినక అవివేకినై పరీక్షింపదలచి వచ్చాను." అని నమస్కరించి మాయమైపోయింది.

శంకరుడు చిన్నబోయి యున్న పార్వతిని పిలచి "ఏమయింది నీ రీక్ష" అని యడిగాడు.

"మీకు తెలియనిదేమున్నది ప్రభూ! నేనే పొరబడ్డాను"

"తొందరపాటు తగదు పార్వతీ! -స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అని పెద్దలూరక

గృహలక్ష్మి

అన్నారా! మంచి చెడ్డ లాలోచించక వచ్చును. కాబట్టే ముఖ్యంగా స్త్రీలకు తొందరపాటుతో తన ముక్కుకు సూటిగా ఓర్పు, ఓరిమి అత్యంతావశ్యకములు" పోతే ఎట్టి ప్రమాదాలైనా సంభవించ అని బోధించాడు పార్వతీపతి.

దారా అచ్యుతాంబ

# మాతృమూర్తి మాధవి అమ్మ

శ్రీ సి. సి. పున్నయ్య



సోదరీ సోదరులతో శ్రీ మాధవి అమ్మ

పూజ్య బాబు కేసరిగారి ననుసరిస్తూ తనన్న ఆయన అనుసరించే లాగా చేసి ఆయన విశాల భావాలను, ఉదార స్వభావమును తీర్చి దిద్దింది శ్రీ మాధవి అమ్మ.

ఆమె దయామయురాలు. ఇతరుల ఆకలి దప్పులు, కష్ట సుఖాలు యూహించి సానుభూతితో ఆదరించే ప్రేమస్వరూపిణి.

నా మట్టుకు నేను ఒకప్పుడు అనారోగ్యమునకు గురియైన సమయంలో ప్రేమాదరణలను నాపై ప్రసరింప జేసింది తల్లి. ఆమె ఆదర ప్రేమాభిమానములకు నా వలె అనేకులు పాత్రులైనారు - యింకా అగుతున్నారు. వారు నిరంతరము కృతజ్ఞతను వెల్లడించుచుండుటలో విశేషమేమి లేదు.

శ్రీ మాధవి అమ్మ బంధుప్రియ. బాబువలెనే యితరులకు అన్నప్రదానము చేయవలెనన్నను, సత్కార, ఆదరణాలు జరుపవలెనన్నను ఆసక్తి ఉత్సాహాలు అత్యధికము. ఈ మధ్య జరిగిన బాబు మృతనాన్నకి వర్ధంతి సందర్భమున తిరుమూరులో జరిగిన అన్నప్రదానము, బ్రాహ్మణపూజాసత్కారములు యిందుకు నిదర్శనములు. ఆనాడు సంతృప్తి సంతుష్టులైన అతిథి అభ్యాగతుల ఆశీస్సులు ఆమెకు, కుటుంబానికి ఆయురారోగ్య సౌభాగ్యాలను తప్పక సమకూర్చగలవు.



పూజాసత్కారాల నందుకొనిన బ్రాహ్మణ్యము

# విండర్ మియర్ సతి విసనకర్ర

రచయిత :

ఆస్కార్ వైల్డ్

అనువాదం :

సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(మే సంచిక తరువాయి)

విండర్ మియర్ సతి:-మిసిస్ ఎర్లిన్, నాభర్త గారి దగ్గిరకి తిరిగివెళ్ళిపో. ఆయన నీ సొత్తు, నా సొత్తు ఎంతమాత్రమూ కాదు. ఆయన లోకాపవాదానికి భయపడుతున్నట్లున్నారు. ఈ పురుషులు వట్టి పిరికిపందలు. లోకంలోని చట్టాలకువ్యతిరేకంగానడిచినా లోకాపవాదం అంటే మాత్రం కంగారెత్తిపోతారు. ఆయన అందుకు సిద్ధంగా ఉండడమే మంచిది. ఆయన ఈ నిందకి లోనుకానియ్యి. ఇన్నాళ్లూ లేనంత ఘోరమైన లోకాపవాదానికి ఆయన తలొగ్గవలసి ఉంటుంది. ఆయనపేరు ప్రతీ ఆకతాయి పేపర్లోనూ పడుతుంది. నాపేరు ప్రతీ దరిద్రగొట్టు పత్రికలోనూ పడుతుంది.

మి.ఎ:-అసంభవం - అసంభవం.

వి.స:-అవును, ఆయనకి అంతే కావాలి. ఆయనేస్వయంగా వచ్చిఉంటే ఆయనా నువ్వూ నన్నే నికృష్టజీవితంలో తొయ్యడానికి తయారైనా నేను సిద్ధంగానే ఉండేదాన్ని - నేను బయలుదేరపోతున్నాను - కాని ఆయన ఇంట్లోఉండి నిన్ను దూతగా పంపడంఉందే - అది నీచము-అత్యంత నీచము.

మిసిస్ ఎర్లిన్:-('సి' టేబిల్ దగ్గిర) విండర్ మియర్ సతీ! మీరు నన్ను అనవసరంగా నిందిస్తున్నారు - మీభర్తగారిని చాలా దారుణంగా నిందిస్తున్నారు. మీరిక్కడుండడం ఆయనకి తెలీదు - సురక్షితంగా మీ యింట్లోనే ఉన్నారని అనుకుంటున్నారు. మీ గదిలో నిద్రపోతున్నారనుకుంటున్నారు. మీరు ఆయనకు వ్రాసిన ఆ పిచ్చి ఉత్తరాన్ని ఆయన చదువలేదు.

విం.స:-(కుంపటిదగ్గర) ఆయన చదవలేదా!

మి.ఎ:-లేదు - దానిని గురించి ఆయనకేమీ తెలీదు.

విం.స:-నేను వెర్రివాజమ్మననుకున్నావా! (అవిడ దగ్గిరకి వెళ్లి) నువ్వు బొంకుతున్నావు.

మి.ఎ:-(తమాయించుకుని) లేదు. నేను నిజమే చెబుతున్నాను.

విం.స:-ఆయన నా ఉత్తరం చదివి ఉండకపోతే నువ్విక్కడికి ఎలాగ రాగలి

గేవు? సిగ్గులేకుండా నువ్వు ప్రవేశించిన మా యింటిని నేను విడిచిపెట్టేనని నీ కెవ్వరు చెప్పేరు? నేనెక్కడికి వెళ్లిందీ నీ కెవ్వరు చెప్పేరు? ఆయనే నీకు చెప్పేరు. నచ్చజెప్పి నన్ను వెనక్కి తీసుకురమ్మన్నారు.

('ఎల్' తలుపువైపు వెడుతుంది)

మి.ఎ:–మీ భర్తగారు ఆ ఉత్తరాన్ని చూడనేలేదు; నేనే - చూచేను; చించేను–నేనే–చదివేను.

వి.స:–(ఆమెవైపుతిరిగి) నేను నా భర్తకి వ్రాసిన ఉత్తరాన్ని నువ్వు చించేవా? నీ కంత సాహసమా?

మి.ఎ:–సాహసమా! ఆహా! మీరు పడిపోబోతున్న అగాధాన్ని చూచేను. ఇక ప్రపంచంలో దేనినైనా సరే చెయ్యడానికి తెగించేను. ఇదిగో ఉత్తరం. మీ భర్తగారు దానిని చదవనేలేదు. ఆయన ఇకమీదట చదవబోరు. (కుంపటి దగ్గిరికివెళ్లి) అటువంటి ఉత్తరాన్ని మీరు వ్రాసియుండకూడదు. (చించి, అగ్గిలో పారేస్తుంది.)

వి.స:–(గొంతుకలోనూ ముఖంలోను చెప్పరాని జుగుప్స కనబరుస్తూ) అదే నా ఉత్తరం అని నేనెలాగ నమ్మతాను. ఈ స్వల్ప ఎత్తుగడకి నేను లొంగిపోతానని అనుకున్నావా?

మి.ఎ:–అయ్యో! నేను చెప్పేదానిని దేనినీ మీరు నమ్మకపోతే ఎలాగ? నేనిక్కడికి రావడానికి కారణమేమిటో తెలుసా? మిమ్మల్ని సర్వనాశనంనుండి రక్షించడానికి. ఆచేసిన తప్పుకు ఫలితంగా రాబోయే విపత్తునుండి రక్షించడానికి. అదిగో ఆ కాలిన ఉత్తరం మీదే. నేను ప్రమాణంచేసి చెబుతున్నా.

విం.స:–(నింపాదిగా) నేను దానిని చూడకముందే, నువ్వు జాగ్రత్తపడి దానిని తగలేశావు. నేను నిన్ను నమ్మలేను. నీ జీవితం అబద్ధాలపుట్ట, ఏ విషయం గురించైనా నువ్వు నిజం ఎందుకు మాట్లాడుతావు చెప్పు?

(కూర్చుంటుంది)

మి ఎ:–(వేగంగా) నన్ను గురించి మీరేమి అనుకున్నా సరే – నాకు వ్యతిరేకంగా మీరేమిఅన్నా సరే – నాకు చింత లేదు. కాని నేనొకటి వేడుకుంటున్నాను– మీకు ప్రేమపాత్రులైన భర్తగారి దగ్గిరికి తిరిగివెళ్లిపొండి, తిరిగి వెళ్లిపొండి.

విం.స:–(కోపంతో) నేను ఆయన్ని ప్రేమించడంలేదు!

మి.ఎ:–మీరు నిజంగా ప్రేమిస్తున్నారు– ఆయనా మిమ్మల్ని ప్రేమిస్తున్నారని

మీకు బాగా తెలుసు.

వి.స:_ఆయనకు ప్రేమంటే ఏమిటో తెలీదు. నీకెంత ప్రేముందో ఆయనకీ అంతే ఉన్నది. నీ ఉద్దేశమేమిటో నా కర్థమయ్యిందిలే. నేను తిరిగిరావడం నీకెంతో లాభదాయకం. భగవంతుడా నేను ఎటువంటి నికృష్ట జీవితాన్ని గడపవలసి ఉండేది. ఏ స్త్రీలో ఏ కోశానా జాలిగాని కరుణగానిలేదో, ఏ స్త్రీని సంధించడమే పరమనీచమో, ఏ స్త్రీని తెలుసుకోవడంకూడా మహాపాపమో, ఏ స్త్రీ పాపాల పుట్టిల్లై నాకూ నా భర్తకూ మధ్యగల నిర్మల వాతావరణాన్ని పాడుచేస్తున్నదో, అట్టి స్త్రీ అధీనంలో నేను ఉండవలసి ఉండేదికదూ!

మి.ఎ:-(నైరాశ్యాన్ని కనబరుస్తూ) విండర్ మియర్ సతీ! విండిర్ మియర్ సతీ! అలాటి అనరాని మాటల్ని అనకండి. ఆ మాటలు ఎంత క్రూరమైనవో, ఎంత బాధాకరమైనవో, ఎంత అన్యాయమైనవో మీకు తెలీదు. వినండి - మీరు తప్పకుండా వినాలి! మీ భర్తగారి దగ్గిరకి తిరిగి వెళ్లిపొండి. ఇకమీదట ఏవంకా కల్పించుకుని ఆయనకి ఉత్తరం వ్రాయను; ఆయన్ని ఇక చూడను. ఇక ఆయన జీవితంతో గాని మీ జీవితంతోగాని నాకు ఏవిధమైన సంబంధము ఉండదని ప్రమాణపూర్వకంగా చెబుతున్నాను. ప్రేమతో కాదు ద్వేషంతో; ఆదరంతో కాదు జుగుప్సతో ఆయన నా కా డబ్బు ఇచ్చేరు. నాకు ఆయనపైగల ప్రభావం-

విం.స:-(లేస్తూ) ఓహో! ఆయనపైన నీ ప్రభావముందని నువ్వు ఒప్పుకుంటున్నావన్నమాట!

మి.ఎ:-అవును, దానికి కారణం లేకపోలేదు. ఆయనకు మీ యెడలగల ప్రేమయే దానికి కారణం.

విం.స:-నేను దానిని ఎంతమాత్రమూ నమ్మలేను.

మి.ఎ:-మీరు దానిని నమ్మాలి. అది నిజం. ఆయన ఈ బెదరింపులూ, దమాయింపులూ ఇత్యాది వాటికి లొంగిపోవడానికి కారణం ఆయనకు మీపైగల ప్రేమయే. ఆయనకు మీ యెడలగల ప్రేమ అపారం. మీరు నిందలకి, అపఖ్యాతికి, అవమానానికి లోనుకాకుండా ఉండడానికే ఆయన ఇలాటి కష్టాలికి లోనౌతున్నారు.

విం.స:-నీ ఉద్దేశమేమిటి? హద్దుమీరిపోతున్నావు. నీకూ నాకూ సంబంధమేమిటి?

మి.ఎ:-(వినయంతో) ఏమీలేదు. అది నాకు తెలుసు. నేను చెప్పదలచిం

దేమిటంటే మీ భర్తగారు మిమ్మల్ని ప్రేమిస్తున్నారు. అటువంటి పరిపూర్ణమైన ప్రేమని మళ్ళా జీవితంలో మీరెప్పుడూ పొందలేరు. అటువంటి ప్రేమ ఈ కాలంలో అరుదు. దానిని మీరిప్పుడు తిరస్కరించేరంటే, మరొకప్పుడు మీరు ప్రేమకై పరితపించినా అది మీకు దొరకదు. దానికోసమై మీరు బ్రతిమాలినా దానిని మీకెవ్వరూ ఇవ్వలేరు-అమ్మా! ఆర్థర్ గారు మిమ్మల్ని నిష్కల్మషంగా ప్రేమిస్తున్నారు!

విం.స:-ఆయన్ని ఆర్థర్ అని పిలుస్తున్నావూ? పైపెచ్చు ఆయనకీ నీకూ ఏవిధమైన సంబంధమూ లేదంటున్నావు?

మి.ఎ:-విండర్ మియర్ సతీ! నేను సత్యప్రమాణకంగా చెబుతున్నాను. మీ భర్తగారు మీపట్ల ఏవిధమైన ద్రోహమూ తలపెట్టలేదు. మీ మనస్సులో అటువంటి దారుణమైన అనుమానం ప్రవేశించిందనే విషయం నాకు చూచాయగానన్నా గోచరించి యుంటే, మీ జీవితానికీ మీ భర్తగారి జీవితానికీ మధ్యగా పానకంలో పుడకలాగ ప్రవేశించేందుకు బదులుగా హాయిగా ఎంతో ఆనందంతో నా ప్రాణాన్ని విడిచిపెట్టి ఉందును.

('ఆర్' సోఫా వైపు వెళ్ళిపోతుంది)

విం.స:-ఏదో జాలిగలదానిలాగ మాట్లాడుతున్నావే! నీలాటివాళ్ళకి హృదయాలు ఉండనే ఉండవు. మీలో హృదయం ఎక్కడిది? డబ్బున్నవాళ్లు మిమ్మల్ని కొనుక్కుంటారు. డబ్బున్న వాళ్లకి మీరు అమ్ముడు పోతారు.

('ఎల్' టేబిల్ దగ్గిర కూర్చుంటుంది)

(సశేషము)






**శ్రీ వేంకటేశ్వర నక్షత్రమాల: కుమారి సుందరి, 6వ ఫారం, సర్కారు ఉన్నత పాఠశాల, బళ్లారి.**

ఇది చిన్న పద్యకావ్యము. ఇందలిపద్యములు శ్రీ తిరుపతి వేంకటేశ్వరుని నామస్మరణకని ఉద్దేశించబడి భావ, రసభరితములై సలక్షణముగా నొప్పుచున్నవి.

రచయిత్రి విద్యార్థిని అయినా దీక్షాసక్తులు, కృషి భవిష్యత్తులో ఉత్తమ కవయిత్రిగా రూపొందించగలవని యీ చిన్న కావ్యము నిరూపించుచున్నది. ఈమెకు భగవంతుడు తోడు నీడౌగాక!

**ప్రజాస్వామ్యం పెరగాలంటే నాస్తికత్వంకావాలి: 'గోరా'నాస్తిక ప్రచురణాలయము, పటమట, (వయా) విజయవాడ, కృష్ణాజిల్లా. వెల 0-10-0.**

నాస్తికత్వము యొక్క ప్రచారమునకు గ్రంథకర్త చేయుచున్న కృషి అపారము. నాస్తిక వాదపు మంచి చెడ్డలెలాగున్నా ప్రజాస్వామ్యం పెరగాలంటే నాస్తికత్వము కావాలని నిరూపించడానికి యీచిన్న పుస్తకం ద్వారా గ్రంథకర్త ప్రయత్నించాడు. సంఘ శ్రేయస్సు నుద్దేశించి ప్రజలు తమ బాధ్యతలను గుర్తించి, హక్కులను, అవకాశములను సమానంగా అనుభవించునట్టి స్వపరిపాలనను పెంపొందించుకొనడం నాస్తికత్వమున్ననే కాని సాధ్యముకాదాయను విషయము చర్చనీయాంశము. విమర్శనా దృష్టితో యీ సమస్య పరిశీలింప గోరువారికి యీచిన్న పుస్తకం తోడ్పడవచ్చును.

**శ్రీ వారణాసి రామసుబ్బయ్యశాస్త్రి జీవితము: శతావధాని చల్లా పిచ్చయ్య శాస్త్రి. వెల 1-0-0.**

సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ రామసుబ్బయ్యగారి జీవిత విశేషాలుగల గ్రంథము. ఆంధ్ర గాయక శిఖామణులు శ్రీ హరినాగభూషణం, నిరాఘాటం రామకోటయ్య, పారుపల్లి రామకృష్ణయ్య మొదలుగాగల వారి ప్రశంసలతోటి, పండిత పామరులయొక్క, శిష్యులయొక్క అభిప్రాయములతోటి యీ గ్రంథము నిండియున్నది. సంగీతప్రియులకు, అభ్యుదయగాయకులకు శ్రీ రామసుబ్బయ్య శాస్త్రిగారి జీవిత విశేషములు అమూల్యములనవచ్చును.

**పద్మపురాణము (బ్రహ్మఖండము): అనువాదకులు శ్రీ మరువాడ శంభన్న శాస్త్రి, ప్రచురణ కర్తలు: సాధన గ్రంథమండలి, తెనాలి. వెల 1-0-0,**

ఈ గ్రంథము చాల అమూల్యమైనది. హిందూమత సంబంధమైన పురాణవిషయాలనేకము లిందులో వివరించబడినవి. విష్ణుభక్తి వర్ణనముతో ప్రారంభమయి, భగవన్నామ మహాత్మ్యము, పురాణశ్రవణ మహాత్మ్యములతో ముగియుచున్న యీ గ్రంథము భక్తి, ముక్తి, రక్తులను ప్రోత్సహిస్తున్నది. సామాన్యప్రజానీకమునకు యిట్టి అమూల్యమైన విషయాలు అందుబాటులోకి తెచ్చిన సాధనగ్రంథమండలి వారు అభినందనీయులు.

— —(0)— —

(338 పేజీ తరువాయి)

లేవు. నన్నే ఆహారంగా స్వీకరించి అనుగ్రహించండి'' అని నమస్కరించిందట.

''నీ పారమార్థిక చింతను మెచ్చుకున్నాను. ఉన్నవాళ్లు లేనివాళ్ల ఆకలి దప్పులను, కష్టసుఖాలను గుర్తించి సానుభూతితో నీవలె సహాయము చేయపూనుకోవాలి'' అంటూ తన నిజస్వరూపదర్శనమిచ్చాడు. కుందేలు కండ్లు మిరుమిట్లుగొన్నాయి.

''నీవికముందెప్పుడూ ఆకాశంలో చంద్రునిలోనుండి యావత్ప్రపంచమునకు కనబడుతూ 'పరులకు మీరీయ పరమేశ్వరుండు మెచ్చి కొల్లలుగాగనిచ్చు మీకు,' అనే సత్యాన్ని జ్ఞాపకముచేస్తూ యుండు'' అని ఇంద్రుడు వరమిచ్చి అంతర్ధానమయ్యాడు. ఆనాటినుండి ఎప్పటికిని ప్రజలందరికి కుందేలు చంద్రబింబాన్నుండి కనుపిస్తూ యుంటుంది. అదే చంద్రునిలోనినల్లని మచ్చ అని అనేకులంటారు! —మరిమీరో—





'సంఘం' చిత్రము యీ నెలలో విడుదల కాబోతున్నది. ఇందులో వైజయంతిమాలయొక్క నృత్యములు, అంజలిదేవి, రామారావుల నటన ప్రత్యేకత.

♦ ♦ ♦

జనతా పిక్చర్స్‌వారి 'పరివర్తన' సయితం జూలై నెలలోనే విడుదలకాబోతున్నదట. దర్శకుడు శ్రీ టి. ప్రకాశరావు. సావిత్రి, నాగేశ్వరావు, రామారావులు నటిస్తున్నారు.

♦ ♦ ♦

మహాలక్ష్మి ప్రొడక్షన్స్‌వారు శ్రీ వి. నాగయ్య దర్శకత్వముక్రింద 'భక్త రామదాసు' చిత్రాన్ని నిర్మించవూనుకున్నారు. ఇందులో నాగయ్య, కన్నాంబ, టి. సూర్యకుమారి, టి. జి. కమలాదేవి నటించుచున్నారు.

♦ ♦ ♦

'సతీసావిత్రి' చిత్రాన్ని పక్షిరాజా పిక్చర్స్ వారు జి. వరలక్ష్మి, యన్. టి. రామారావు, రంగారావులు నటీనటులుగా నిర్మించనున్నారట.

♦ ♦ ♦

'బాలసన్యాసమ్మ' చిత్రనిర్మాణానికి రేవతి జోయా పిక్చర్స్‌వారు వూనుకున్నారు. జి. వరలక్ష్మి, జగ్గయ్య, గిరిజ, వంగర మొదలైనవారు నటీనటులు. రచన, దర్శకత్వములను సముద్రాల రాఘవాచార్య, పి. సుబ్బారావులు నిర్వహిస్తారు.

♦ ♦ ♦

'రాజాపేద' చిత్రము ఆంధ్రదేశంలో విజయయాత్ర సాగిస్తున్నది.

♦ ♦ ♦

అన్నపూర్ణా పిక్చర్స్‌వారి 'దొంగరాముడు' చిత్రానికి శ్రీ కె. వి. రెడ్డి దర్శకత్వము నిర్వహిస్తాడు. సంగీతం పెండ్యాల నాగేశ్వరావు. జమున, సావిత్రి, రేలంగి యిందులో నటిస్తున్నారు.

♦ ♦ ♦

నర్తకి కుమారి కమలకు, 'టైమ్స్ ఆఫ్ ఇండియా' సంస్థలో పనిచేస్తున్న ఆర్. కె. లక్ష్మణ్‌కు జూన్ 25-వ తేదిన వివాహం మద్రాసులో జరిగింది. ఆ సందర్భమున జరిగిన విందుకు ముందు డి. కె. పట్టమ్మాళ్ పాటకచేరి, విందు అనంతరం బేబిరాధ నృత్యము జరిగింది.

♦ ♦ ♦



'సంఘం'లో వైజయంతిమాల



బాల నర్తకి

సాహిణీవారి 'అమర సందేశం' చిత్రము తయారులో నున్నది. ఇందులో శ్రీ రంజని, అమరనాథ్, రేలంగి మొదలగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

'మిస్సమ్మ' చిత్రాన్ని విజయావారు భానుమతి, దొరస్వామి, రమణారెడ్డి మొదలగువారితో తీస్తున్నారు. దర్శకుడు ప్రసాద్.

♦ ♦ ♦

విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి 'మాగోపి' చిత్రం రేవతిస్టుడియోలో షూటింగు జరుగుతున్నది. జమున, మాష్టర్ వెంకటేశ్వరావులు నటిస్తున్నారు.

♦ ♦ ♦

'విప్రనారాయణ' చిత్రనిర్మాణం భరణీ స్టుడియోలో జరుగుతున్నది. శ్రీరామకృష్ణ ప్రొడ్యూసర్ - డైరెక్టర్. భానుమతి దేవదేవిగా నటిస్తున్నది.

♦ ♦ ♦

శ్రీ. బి. యన్. రెడ్డిగారి 'బంగారుపాప' చిత్రం వాహినీ స్టుడియోలో షూటింగు జరుగుతున్నది. యస్. వి. రంగారావు, లీల, పి. హేమలత మొదలైనవారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

'రేచుక్క' షూటింగ్ రేవతిలో జరుగుతున్నది. ఇందులో అంజలిదేవి, రామారావు, జోగారావులు నటిస్తున్నారు.

♦ ♦ ♦

నరసూ పిక్చర్స్ వారి తెలుగు చిత్రం ఓంప్రథమంలో 'విషబిందువు'గానుండి తర్వాత 'అమృతబిందువు' అయి చివరకు 'రాజయోగి'గా యీ నెలలోనే విడుదల కాబోతున్నదని తెలుస్తున్నది.

♦ ♦ ♦

శ్రీ రాగిణీ ఫిలిమ్స్‌వారు తయారుచేస్తున్న 'స్వయంసిద్ధ' చిత్రంలో శాంతకుమారి, సావిత్రి, నాగేశ్వరావు మొదలగు వారు నటిస్తున్నారు. పి. పుల్లయ్యగారి దర్శకత్వము.

# సంపాదకీయములు

## కాంగ్రెస్‌లో స్త్రీలశాఖ

భారతజాతీయ కాంగ్రెస్ సంస్థలో ఏనాటినుండియో యీనాటివరకు స్త్రీలుచేరి పురుషులతోబాటు జాతీయ ఉద్యమ విస్తరణకేమి, అన్ని రంగాలలో పురోభివృద్ధికేమి కృషిచేస్తున్నవారే. వారియొక్క అఖండ సేవాత్యాగాలు స్వాతంత్ర్యసిద్ధికి విశేషంగా తోడ్పడినవి. అయితే యీనాడు ప్రత్యేకంగా కాంగ్రెస్‌లో స్త్రీలశాఖ స్థాపనకు అవసరమేమివచ్చిందా ! అనేదే ప్రశ్న.

అయితే యిందుకు కారణం యీ విధంగా చెప్పకోవచ్చు - కాంగ్రెస్ సంస్థకు, జాతీయపురోభివృద్ధికి ఆయువుపట్టయిన గాంధేయ సిద్ధాంతాలు, నిర్మాణ కార్యక్రమంపట్ల ఆసక్తి చూపడంలేని పురుషులకు బదులుగా స్త్రీలైనా ముందంజవేసి వాని ప్రచారానికి, అమలుకు దీక్షతో కృషిచేస్తారని, దాని మూలంగా నీరసావస్థలోనున్న కాంగ్రెస్‌సంస్థ పునరుజ్జీవం పొందగలదని హైకమాండు భావించియుండవచ్చును.

అదే హైకమాండు ఉద్దేశమయినచో పురుషులకు దక్కని ఘనతను సాధించుటకు జాతీయతను, గాంధీజీ నిర్మాణకార్యక్రమమును, జాతీయ సిద్ధాంతములను స్త్రీలు గ్రామసీమలలో నిర్విరామంగా ప్రచారంచేసి అవి జాతీయపురోభివృద్ధికి వినియోగపడగల అవకాశములను గ్రామీణులకు, పట్టణవాసులకు తెలియజెప్పాలి. వానిని తామనుసరిస్తూ విశేషప్రజానీకంచేత అనుసరింపజేయాలి. అప్పడు పురుషులలో సైతము నైతికంగాను, మానసికంగాను విశేషమార్పురావడం, తద్వారా దేశం మొత్తంలో గాంధీజీ ఆశించిన 'రామరాజ్య' స్థాపన కవకాశము లేర్పడును.

♦ ♦ ♦

## బాలబాలికలకు విద్యాభ్యాసానికి అవకాశం

ప్రపంచం మొత్తంమీద బాలబాలికలలో సగంమందికే విద్యాభ్యాసానికి అవకాశముకలదని ప్రపంచ విజ్ఞానసమితి డైరెక్టర్ జనరల్ వెల్లడించాడు.

అలా ఎందువలన ? విద్యాభ్యాసానికే నూటికి 50 మంది బాలబాలికలకు అవకాశముంటే దైనికావసరాలైన కూడు,గుడ్డలాంటివి ప్రపంచములో నూటికి ఎంతమందికి లభ్యములుగానున్నవోననునది యూహాతీతము.

ప్రపంచములో ప్రతిమానవుడు కోరునది నలుగురితోబాటు నిత్యజీవితావసరములు, గౌరవప్రదమైన జీవితము. అవి పొందగోరడం, సాధించడం వాని జన్మహక్కు. అట్టి వానిలో తన పిల్లలకు విజ్ఞాన వికాసాభివృద్ధుల నుద్దేశించి విద్యాబోధనను కోరడం న్యాయసమ్మతం. దానిని సమకూర్చవలసిన బాధ్యత ప్రతియొక్క దేశంలోని ప్రభుత్వపు ధర్మం. ప్రజలు సయితం బీదవాడు, సంపన్నుడనే విచక్షణలేకుండా పరస్పర సహకార, సానుభూతి, సద్భావములతో నిత్యజీవితావసరాల సమకూర్పుకు - ముఖ్యంగా బాలబాలికల విద్యాభ్యాసానికి దోహదమివ్వాలి. ఇది నాగరికతా చిహ్నమనిపించుకుంటుంది.

—o—

# ముచ్చట్లు

నారసీచు'

బాలల సాహిత్యం కన్నడ, గుజరాతీ ప్రాంతాలకే కాక అన్ని భాషా ప్రాంతాలకు - ముఖ్యంగా తెలుగు ప్రాంతానికికూడ అవసరమే. కన్నడ, గుజరాతీ భాషలలో బాలల సాహిత్యముపట్ల చూపుచున్న ఆసక్తి, యివ్వ నుద్దేశించిన ప్రోత్సాహము తెలుగుభాషా ప్రాంతానికి సయితం యివ్వడం ప్రభుత్వ ధర్మం. దానిని వినియోగించుకొని రచయితలు ఉత్తమోత్తమమయిన బాలల సాహిత్యాన్ని రూపొందించి బాలబాలికల పురోభివృద్ధికనువైన వినోద విజ్ఞానాలను విస్తరింపజేయాలి.

♦ ♦ ♦

వనమహోత్సవాల సందర్భమున వృక్షసంపదాభివృద్ధికి యితోధిక శ్రద్ధాసక్తులను గురించి అనేకులు అనేక సూచనలు చేశారు, కాని ఆచరణకుగల అవకాశములు, సాధక బాధకములు గుర్తించవలసినవి.

జీవయాత్రలో వృక్షసంపద మహోపయుక్తమయింది. తలదాచుకోడానికి నీడ, తినడానికి ఆహారం, ఆరోగ్యపోషణ రక్షణలకు ఔషధాలు మొదలైన మానవదైనికావసరములను సమకూర్చుచున్నది వృక్షసంపద. ఇట్టి వృక్షసంపదాభివృద్ధికి మానవుడు కృషి చెయ్యడమంటే మానవుడు అభ్యుదయ మార్గంలో పురోగమిస్తున్న దారులలో నిది యొకటి.
తమ జీవితంలో అనేక విధాల సహకరిస్తున్న వృక్షసంపద అభివృద్ధికి పరిశోధనా పూర్వకంగా ఆసక్తి ఉత్సాహాలతో కృషిసల్పిననేకాని యావత్ప్రపంచము కళాకాంతులతోటి, నవనవలాడే జీవితంతోటి రాణింపజాలదు.

♦ ♦ ♦

"స్విట్జర్లాండ్ దేశంలోజరిగిన ప్రపంచనైతిక పునరుజ్జీవన మహాసభలో అధ్యక్షపీఠాన్నుండి "నైతిక పునరుజ్జీవనసంస్థ (ఎం. ఆర్. ఎ.) మానవులలో అపూర్వమైన పరివర్తన కలిగిస్తుంది. ఈ పరివర్తన వచ్చేవరకు మానవులు పరస్పరం వంచించుకోడం సాగుతూనే యుంటుంది. మొత్తం మానవజాతిలో యీ పరివర్తనం కలుగడం చాల అవసరం. ఇట్టి పరివర్తన కలిగినవారే భవిష్యత్తును సుఖప్రదంగా రూపొందించకలుగుతారు" నొక్కి వక్కాణించబడింది.

ఇట్టి పరివర్తన అత్యంతావసరమనునది నిర్వివాదాంశము. అది ఎవరిలో - ఏవిధంగానది సాధ్యమనునది పరిశీలించవలసినది. విచక్షణా రహితంగా సర్వప్రజానీకం బాధ్యతాయుతంగా వ్యవహరించిననాడు కదా యిది సాధ్యం! తమ తమ భేదాలు నశించిననాడుకదా పరస్పరం వంచించుకోడమనేది రూపుమాసేది? వీనిని గుర్తించవలసింది, వ్యవహరించవలసింది నైతికపునరుజ్జీవన సంఘంకాని, ప్రజానీకంలో ఏ ఒక్క వర్గముకానికాదు. సర్వప్రజానీకం ఆత్మను చంపుకోకుండా నైతికపునరుద్ధరణయొక్క ఆవశ్యకతను గుర్తించి వ్యవహరించిననాడు ప్రపంచములోని ప్రస్తుత సంక్షోభపరిస్థితు లుండవనియు, శాంతి సౌభాగ్యాలకు ప్రపంచము నిలయము కాగలదనిగంటాపథంగా చెప్పవచ్చును. ఇందుకు మనమంతా కృషిచేద్దాం!

♦ ♦ ♦

మొదట మాతృభాష, తర్వాత జాతీయ, ప్రపంచ భాషలు అభ్యసించడము అవసరమని నిజాంమంత్రి డాక్టర్ మేల్కోటేగారు ఉపన్యసిస్తూ చెప్పారు. కాని మాతృభాష, జాతీయభాషల నభ్యసించడంలో ఏదిముందు, ఏదివెనుక అనేది వివాదరహితమయినది. ఇంగ్లాండు, ఫ్రాన్స్‌లాంటి దేశాలలోని పాఠశాలలో తమ స్వభాషతోబాటు యితర రెండుమూడు భాషలను విద్యార్థులు అభ్యసిస్తారు. అలాగే మన దేశంలో సయితము ప్రాంతీయభాషతోబాటు జాతీయ భాషను, ఇంగ్లీషులాంటి ప్రపంచభాషను అభ్యసించడము కష్టసాధ్యము కానేరదు. దీనిని ప్రభుత్వము ప్రోత్సహించాలి; ప్రజలు వాని ఆవశ్యకతను గుర్తించి ఉత్సాహాసక్తులతో ఆ భాషల నభ్యసించాలి.

---

# శ్రీ జయనామ సం॥ర ఆషాఢ-శ్రావణమాసములు

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ జూలై | 16 | శు | బ. పాడ్యమి 58-47 ఉషా 45-42 రా 25-50 |
| | 17 | శ | వి 57-18 శ్ర 48-21 రా 26-18 |
| | 18 | ఆ | త 54-38 ధ 47-45 శేష 2-4 |
| | 19 | సో | చ 50-48 శ్ర 46-0 దివ 5-6 త్యా 3-53 |
| | 20 | మం | పం 45-59 పూ.భా 43-14 ది 1-8 |
| | 21 | బు | ష 40-19 ఉ.భా 39-37 దివ 5-41 |
| | 22 | గు | స 34-5 రేవ 35-24 ది 7-25 |
| | 23 | శు | అ 27-33 అశ్వ 30-52 ది 21-35 |
| | 24 | శ | న 20-55 భా 26-16 రా 22-15 తిథిద్వయం |
| | 25 | ఆ | ద 14-29 కృ 21-52 రా 27-32 |
| | 26 | సో | ఏ 8-31 రో 18-0 దివ 31-15 సర్వేషాం |
| | 27 | మం | ద్వా 3-13 ఏష్యం మృ 55-18 రా 3-16 |
| | 28 | బు | చతు 55-10 ఆర్ద్రా 12-36 రా 10-18 |
| | 29 | గు | ● అమా 53-2 పున 11-27 దివ 31-31 |
| | | | **శ్రా వ ణ మా స ము** |
| 1954 సం॥ ఆగష్టు | 30 | శు | శుద్ధపాడ్యమి 52-8 పుష్య 11-29 రా 12-29 |
| | 31 | శ | విదియ 52-28 ఆశ్రే 12-45 రా 12-21 |
| | 1 | ఆ | త 53-57 మ 15-13 రా 4-46 స్వర్ణగౌరివ్రతం |
| | 2 | సో | చ 56-31 పూఫ 18-46 రా 6-30 త్యా 4-19 నాగచతుర్థి |
| | 3 | మం | పం 59-56 ఉఫ 23-18 రా 14-33 మంగళగౌరివ్రతారంభం |
| | 4 | బు | ష 60-10 హ 28-33 రా 18-54 |
| | 5 | గు | ష 4-4 చి 34-16 రా 18-7 త్యా 4-24 |
| | 6 | శు | స 8-29 స్వా 40-18 రా 24-10 |
| | 7 | శ | అ 12-57 విశా 46-16 రా 25-43 |
| | 8 | ఆ | న 17-17 అనూ 52-2 శేషం 1-28 |
| | 9 | సో | ద 21-6 జ్యేష్ఠ 47-5 దివ 7-15 శూన్యతిథిః |
| | 10 | మం | ఏ 24-15 మూ 60-10 రా 25-3 ఏకాదశితిథిః |
| | 11 | బు | ద్వా 26-30 మూ 1-11 ది 26-33 |
| | 12 | గు | త్ర 27-39 పూషా 4-27 దివ 25-12 |
| | 13 | శు | చతు 27-35 ఉషా 6-33 దివ 16-43 వరలక్ష్మీవ్రతం |
| | 14 | శ | ○ పౌ 26-17 శ్ర 7-27 దివ 17-25 ఉపాకర్మహోమం |
| | 15 | ఆ | బ. పాడ్యమి 23-45 ధని 7-8 ది 24-44 తిథిద్వయం |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

## ఏజంట్లు కావాలి!

బొంబాయి, హైదరాబాద్, సికందరాబాద్, విశాఖపట్టణం, కర్నూలు, గుంటూరు, బాపట్ల, ఒంగోలు, చిత్తూరు, కడప, గూడూరు, తిరుపతి, బరంపురం, బెంగుళూరు - యింకా యితర ప్రదేశాలలో మాపత్రికలు అమ్మబడని చోట్లలో తమస్వంత బాధ్యతపై అమ్ముటకు ఏజంట్లుకావలెను.

ఏజంట్లుగానుండగోరువారికి రు 100/-కి రు 20/-లు కమీషను, ఒక ఫ్రీకాపీ యివ్వబడును. ఇతర వివరములకు వ్రాయండి!

మా పత్రికకు అడ్వర్టైజుమెంటులను కాన్వాస్ చేయువారికి మంచి కమీషను సదుపాయాల నివ్వగలము.

**గృహలక్ష్మి కార్యాలయం**

రాయపేట, మద్రాసు 14.

---

వేలాది ప్రజల ప్రశంసలకు పాత్రమైనది!

## 'నా చిన్ననాటి ముచ్చట్లు'

(డాక్టరు కే. యన్. కేసరిగారి రచన)

అందమైన అచ్చు - చక్కని తయారీ అనేక చిత్రములతో రు 3-0-0

(పోస్టేజి రు 1-0-0 ప్రత్యేకం)

వ్యాపారులకు ప్రత్యేక కమీషను వసతులు!

**గృహలక్ష్మి కార్యాలయం**

మద్రాసు 14.

Lodhra Press, Madras-14.